


## ఫోర్‌హాన్స్‌తో దంతసంరక్షణను నేర్పండి

ఆమె శక్తిసామర్థ్యాలు పెరుగుతున్నాయి. మీ శిక్షణలో ముమ్ముందు ఆమె అనేక ముఖ్య విషయాలు నేర్చుకుంటుంది. సరియైన దంతసంరక్షణ ఆమెకు తప్పక నేర్పండి. ఫోర్‌హాన్స్ ఏ విధంగా ఇగుళ్ళ జబ్బులను, పంటిక్షయమును నివారింపగలదో చెప్పండి. ఇదే మంచి సమయం ఎందుకంటే, తన పళ్లు జీవితకాలమంతా ఉండాలి.



ఫోర్‌హాన్స్ టూత్‌పేస్టు ఒక దంతవైద్యుడు నిర్మించింది. అందులో బిగువైన యిగుళ్ళకు కావలసిన ప్రత్యేకమైన మందులున్నాయి. ఈ టూత్‌పేస్టు మీకు మంచిదని, మీ అమ్మాయికి కూడా మంచిదని మీకు తెలుసు. ప్రతి రాత్రి, ప్రతి ఉదయం ఫోర్‌హాన్స్‌తో పళ్లతోముకోవడం ఆమెకు నేర్పండి. జీవితకాలమంతా ఆమె పళ్లు సురక్షితంగా ఉంటాయి.

## జాగు చెయ్యక ఫోర్‌హాన్స్‌తో దంతసంరక్షణ ఇప్పుడే నేర్పండి




ఉచితం: "పళ్లు ఇగుళ్ళను గురించి తీసుకోవలసిన శ్రద్ధ"* అనే పుస్తకం రంగుచిత్రాలలోనున్న ఈ పుస్తకం అనేక విషయాలను తెలుపుతుంది. పది భాషల్లో† దొరుకుతుంది. (తపాలా ఖర్చుకు) 10 పై. బిళ్ళలు పంపండి. అడ్రసు: మానర్స్ డెంటల్ అడ్వైజరీ బ్యూరో, పోస్టు బ్యాగు నం. 10031, బొంబాయి-1.

పేరు ..................................................................

అడ్రసు ..................................................................

† మీకు కావలిసిన భాష క్రింద గీతపెట్టండి: తెలుగు, ఇంగ్లీషు, హిందీ, మరాఠీ, గుజరాతీ, ఉర్దూ, బెంగాలీ, అరవం, మలయాళం, కన్నడ.

* ఈ పుస్తకం అతడు చదివే పుస్తకాలలో కెల్ల ముఖ్యమైనది కావచ్చు

**ఫోర్‌హాన్స్** టూత్‌పేస్టు—ఒక దంతవైద్యుడు నిర్మించినది

CMGM-19F C TL

"C. 1"

# చందమామ

ఈ సంచికలో కథలు, వింతలు - విశేషాలు



ఇవి గాక ఫోటో శీర్షికల పోటీ, మరి ఎన్నో ఆకర్షణలు.

# బలము మరియు శక్తి కోసం!




## క్యాడ్‌బరీస్

# బోర్న్‌విటా

బోర్న్‌విటా పోషకత్వమునకు సముచిత మైనది. కండరములు మరియు టిస్యూలను బలపరచుటకు ప్రోటీన్‌లు, బలము మరియు శక్తి కోసం కార్బొహైడ్రేట్‌లు, ఎముకలను దృఢముగా చేయుటకు ఖనిజ లవణములు మరియు ఆరోగ్యమునకు అతి ముఖ్యమైన విటమిన్‌లు మీకు లభించును. బోర్న్‌విటా తయారు చేసుకోవడం సులభం మరియు అది రుచిగా కూడా నుండును!

Bensons/CP-579A/2 Tel

## మనలో మాట...

# భలేబాగా చేశావురా అబ్బాయి!

నీ ప్రోగ్రెస్ రిపోర్టు చూచి నాకు సంతోషమైంది. మంచి మార్కులు తెచ్చుకొన్నావు. గత సంవత్సరంకంటే బాగానే వచ్చాయి. అయితే ఇప్పుడు నీవు మధ్యాహ్న భోజన పథకానికి తోడ్పడుతున్నావట కదూ!

నేను 8వ తరగతికంటే యెక్కువ చదువుకోలేకపోయాను. ఎందుకంటే ఇక్కడికి 10 మైళ్ళ లోపల ఎక్కడా హైస్కూలు వుండేదికాదు. నాకు చాల చిన్న వయస్సు అని మీ తాతయ్య నన్ను హాస్టలులో పెట్టి చదివించలేదు. పైగా బోలెడంత ఖర్చవుతుందని తటపటాయించాడు.

అసలుసంగతి చెప్పడం మరచాను. ఇది చాల మంచి రోజులా వుంది. అంతా మంచి వార్తలే వింటున్నాను. రవి వాళ్ళ టీచరు నాకు జాబు వ్రాశాడు. సైన్సులో ప్రతిభ చూపినందుకు రవికి స్కాలర్‌షిప్ ఇచ్చారట!

రవి పెద్ద అయ్యాక ఇక్కడి ఫ్యాక్టరీలో పని చేయాలని నా కోరిక. ఈ జిల్లా కేంద్రంలో తొలిసారిగా ఫ్యాక్టరీ తెరచినపుడు మేమంతా ఎడ్లబండిలో 27 మైళ్ళు వెళ్ళి చూచి వచ్చాం. అది మాకు ఒక పెద్ద వింత.
మరి. కాలాలు మారిపోయాయి.

## ప్రణాళిక అంటే ప్రగతి

| | 1951 | 1965 |
|---|---|---|
| 6-11 సంవత్సరాల వయస్సుగల స్కూలు పిల్లలు (మిలియన్లు) | 19.15 | 51.50 |
| విద్యార్థి ఉపకార వేతనముల కొరకు ఖర్చు (కోట్ల రూపాయలలో) | 2.75 | 35.00 |
| సాంకేతిక విద్య ప్రవేశపు సౌకర్యాలు (డిగ్రీ కోర్సులు) | 4,120 | 24,709 |



davp 67/29

ASP-TIL-25 TEL

లూనార్ తో ఉతికితే
మీ బట్టలు కొత్తవిగా
వుండడమేగాక
చిరకాలం మనగలవు






బట్టలను
అమిత పరిశుభ్రంగా
ఉతకడానికి
వనరుగా లూనార్
ఎక్కువ
నురుగునిస్తుంది

తుంగభద్ర
ఇండస్ట్రీస్ లి., కర్నూలు

## అశోకా శాండల్ ఫేస్, ఆల్-పర్పస్ టాల్క్యమ్ పౌడర్సు

ఫేస్ పౌడరుగానూ ఇంకా మరి అనేక విధాలు గానూ ఉపయోగింప తగినది. ఔషధ ప్రభావమూ, పరిమళమూ కూడినది.






రోజంతా మీకు సహజమైన మంచి చందనపు సుగంధము నిచ్చి, నూతనోత్సాహమును కల్గించును.

ఉష్ణగడ్డలు, మొటిమలు, చెమటగజ్జి, అసహ్యమైన మచ్చలు మొదలైన వన్నీ తొలగించి, మీ చర్మమును మృదువుగా ఆరోగ్యవంతంగా ఉంచి, పట్టులాగా మెరిసేటట్టు చేస్తుంది. ఈ రెండు విధాల ఫలితాల కోసం నేటినుండే వీటిని ఉపయోగించండి.

**విజయా కెమికల్స్, మదరాసు-7.**

## ఊరగాయ పచ్చళ్లకు అమూల్యమైననూనెలు

అగ్‌మార్కు కాబడిన ఎ.యస్.బ్రాండ్ చాయపప్పు నూనె







అగ్‌మార్కు కాబడిన మేన్షన్‌బ్రాండ్ నువ్వులనూనె

ముక్కనుమెత్తబడనీయవు
బూజుపట్టనీయవు
చాలకాలమునిలువయుంచును
16, 4, 2. కిలోగ్రాంల డబ్బాలలో పేకింగు చేయబడు చున్నవి.
ఇండియన్ గవర్న మెంటువారి అగ్‌మార్కు సీలును గమనించి కొనుడు.

ఏజంటు :

శ్రీ మాజేటి వీరరాఘవయ్య,
కమిషను మర్చంటు, విజయవాడ

డిపోలు :

శ్రీ జి. సుబ్బారావు,
డాక్టరు వుళ్ళక్కి స్ట్రీటు, తెనాలి

శ్రీ బి. గోపాలకృష్ణమూర్తి,
1-3-166, రాజాముదలియార్ స్ట్రీటు,
కలాసిగుడ, సికింద్రాబాద్.

MFRS, అంబటి సుబ్బన్న & కో. సామర్లకోట



# చందమామ

సంచాలకుడు : 'చక్రపాణి'

నవ్వు నాలుగందాల చేటు అని మన వాళ్ళు సామెత చెబుతారు. హాస్యానికి అడే అబద్ధాలు ఒక్కొక్కసారి చాలా ప్రమాదకరంగా పరిణమిస్తాయి. ఇదే నీతి "చిన్నఅబద్ధం" అన్న కథలో మనకు కనిపిస్తుంది.

"కన్నప్రేమ" అనే కథ చిన్నదైనా అందులోని విషయం గొప్పది. పెద్ద వాళ్ళ ప్రేమను చిన్నవాళ్ళు సాధారణంగా లక్ష్యపెట్టరు. ఇది పొరపాటు.

"అపద్రక్షకుడు" [బేతాళకథ] పంపినవారు సి. నిర్మలాదేవి.

సంపుటి 41 జూలై '67 సంచిక 1

CHITRA



# భారత చరిత్ర



పరిస్థితి ఎలా వచ్చిందంటే, డూప్లే ఎత్తులు పారేపక్షంలో మద్రాసులో బ్రిటిషువారి బావుటా దిగిపోవలిసిందే. ఈ పరిస్థితిలో ఇంగ్లీషువారికి రక్షకుడుగా సాండర్స్ అనే ఆయన తటస్థపడ్డాడు. ఈ సాండర్స్ కొత్త గవర్నరుగా వచ్చి 1750 సెప్టెంబరులో పదవి పుచ్చుకున్నాడు. సాండర్స్ ప్రేరణతో ఇంగ్లీషు బలాలు ఫ్రెంచి బలాలతో బాహాటంగా పోరాటానికి తలపడ్డాయి. ఇంగ్లీషు వారి ప్రేరణతో ముహమ్మదాలీ డూప్లేను అనేక మాసాలపాటు మభ్యపెట్టి ఉంచాడు. ఈలోపుగా బ్రిటిషు బలాలకు మైసూరు, తంజావూరు రాజుల మద్దతూ, మురారీరావు అనే మహారాష్ట్ర నాయకుడి మద్దతూ లభించింది.

బ్రిటిషువారి విజయాలకు రాబర్ట్ క్లైవ్ కూడా తోడ్పడ్డాడు. అతను బ్రిటిషు కంపెనీలో సివిలు ఉద్యోగిగా మద్రాసు వచ్చాడు.

క్లైవు 200 మంది తెల్ల సైనికులనూ, 300 మంది సిపాయీలనూ వెంటబెట్టుకుని వెళ్ళి ఆర్కాటును ఆక్రమించాడు. అతను ఊహించినట్టే ఆర్కాటు నవాబు తన రాజధానిని కాపాడుకోవటానికి తన సేనలో అధిక భాగాన్ని ఆర్కాటుకు పంపాడు. క్లైవు 53 రోజులపాటు ఆర్కాటు నగరాన్ని వీరోచితంగా కాపాడాడు (1751 సెప్టెంబరు, అక్టోబరు మాసాలు.)

ఆర్కాటును వశపరచుకోవటంతో బ్రిటిషువారి పరపతీ, వారి యుద్ధ నైపుణ్యమూ ప్రసిద్ధిలోకి వచ్చాయి. ఫ్రెంచివారు బెదిరారు. వారి నాయకుడు శ్రీరంగ ద్వీపంలో దాక్కున్నాడు. క్లైవు సలహాపై బ్రిటిషువారు ఆ ద్వీపాన్ని ముట్టడించి, 1752 జూను 9 న లోబరచుకుని, ఫ్రెంచి సేనానాయకుణ్ణీ, సైనికులనూ ఖైదీలుగా పట్టుకున్నారు. చందాసాహెబు లొంగిపోయి

70. ఇంగ్లీషువారు—సిరాజుద్దౌలా



శిరశ్ఛేదం పొందటంతో ఫ్రెంచివారి అపజయం పూర్తి అయింది.

అయినప్పటికీ డూప్లే తన రాజకీయపు ఎత్తుగడలనుగాని, తిరుచినాపల్లి దుర్గాన్ని పట్టుకునే ప్రయత్నాన్నిగాని విరమించలేదు. అతని ఎత్తుగడలు కొంతవరకు పారుతూండగానే ఫ్రెంచి ప్రభుత్వం అతనిని వెనక్కు పిలిపించింది. డూప్లే చేసిన దూరాలోచన ఫ్రెంచి ప్రభుత్వానికి అంతు పట్టలేదు; అతను చేసిన యుద్ధాలలో అపజయాలూ, అందుకుగాను జరిగిన ధనవ్యయమూ చూసి వారు విసిగిపోయారు. ఫ్రాన్సు నుంచి ఒక రాయబారి వచ్చి, బ్రిటిషువారితో ఒక విధమైన సంధి చేసుకున్నాడు.

ఇంగ్లీషువారికీ, ఫ్రెంచివారికీ మధ్య కుదిరిన ఈ సంధి, యూరప్‌లో "ఏడేళ్ళ యుద్ధం" ప్రారంభం కావటంతో భగ్నమయింది. ఆ యుద్ధంలో ఫ్రాన్స్ ఇంగ్లాండులు శత్రుపక్షాలలో చేరటం చేత, భారత దేశంలోని ఇంగ్లీషు, ఫ్రెంచి వర్గాలవారు పోరాటానికి దిగవలిసి వచ్చింది.

ఈ ఘర్షణలో కూడా ఫ్రెంచివారు, కర్నాటకంలో లాగే, బెంగాలులో కూడా నష్టపోయారు. అప్పట్లో బెంగాలు సుబేదారు పరిపాలనలో ఉండేది. సుబేదారు



పేరుకు ఢిల్లీ పాదుషా కిందివాడే అయినా, వాస్తవంగా స్వతంత్ర రాజులాటివాడు. బెంగాలు నవాబైన అలీవర్దీఖాన్ 1756 ఏప్రిలు 9 న మరణించగా, ఆయన ఆఖరు కుమార్తె కొడుకైన సిరాజుద్దౌలా బెంగాలు నవాబు అయాడు. అలీవర్దీఖాన్ అస్వస్థుడుగా ఉండి, సిరాజుద్దౌలా తాను పరిపాలన చేస్తున్న కాలంలోనే అతనికీ ఇంగ్లీషువారికీ మధ్య మంచి సంబంధాలు లేవు. ఏమంటే కలకత్తా నగరాన్ని ఫ్రెంచి దాడుల నుంచి కాపాడటానికి ఇంగ్లీషువారు అదనపు రక్షణలను నిర్మించారు. కర్నాటకంలో జరిగిన సంఘటనలు విని ఉన్న సిరాజుద్దౌలాకు

ఇది ఎంత మాత్రమూ సమ్మతం కాలేదు; ఇంగ్లీషువారు నవాబు అనుమతి లేకుండా, కోటగోడలు నిర్మించి, వాటి పైన ఫిరంగులు ఏర్పాటు చేశారు.

నిజానికి సిరాజుద్దౌలా నవాబు అవుతాడని ఇంగ్లీషువారు అనుకోలేదు; అతని శత్రు పక్షంలో చేరినవాడైన దివాన్ రాజవల్లభుడు నవాబు అవుతాడని పూర్తిగా నమ్మి అతన్ని మంచి చేసుకున్నారు. (ఈ రాజవల్లభుడు ఆలీవర్దీ పెద్ద కుమార్తె అయిన ఘసితి బేగమ్ కింద దివాను.)

సిరాజుద్దౌలా నవాబుగా గద్దె ఎక్కుతూనే, కొత్తగా కట్టిన రక్షణలు నిర్మూలించవలసిందని ఇంగ్లీషువారిని హెచ్చరించాడు. "మీరు వర్తకులు; వర్తకం చేసుకున్నంత కాలం మాకు మీతో పేచీ లేదు," అని అతను కాసింబజార్‌లోని ఇంగ్లీషు ఫాక్టరీ అధిపతి అయిన వాట్స్‌కు కబురుచేశాడు. కలకత్తాలో ఇంగ్లీషువారి ఆశ్రయంలో ఉన్న రాజవల్లభుడి కుటుంబాన్ని తనకు వశపరచవలసినదిగా కూడా అతను ఇంగ్లీషు గవర్నరు డ్రేక్‌కు కబురు చేశాడు. కాని ఇంగ్లీషువారు అతని ఉత్తరువులను ఖాతరు చెయ్యలేదు.

సిరాజుద్దౌలా మంచి కార్యదక్షత ప్రదర్శించి, జూను 4న కాసింబజారులోని ఫాక్టరీ స్వాధీనపరచుకుని, అక్కడి నుంచి కదిలి 16 తేదీకి కలకత్తా చేరాడు. గవర్నర్ డ్రేక్, సేనాపతీ, తదితర ప్రముఖ ఇంగ్లీషు వ్యక్తులూ దుర్గాన్ని విడిచిపెట్టి వెళ్ళి, తమ నౌకలలో తలలు దాచుకున్నారు. 20న ఫోర్ట్ విలియం సిరాజుద్దౌలో వశమయింది.

(సిరాజుద్దౌలా ఇదే చొరవను చివరిదాకా చూపించి ఉంటే భారత చరిత్ర ఎలా ఉండేదో! కాని అతను రానురాను శాపగ్రస్తుడిలాగా అయిపోయి అనేక పొరపాట్లు చేశాడు. వీటివల్ల ఇంగ్లీషువారు లాభం పొందారు.)





# చిన్న అబద్ధం

వలభీనగరంలో కుమారదత్తు డనే సంపన్న వర్తకు డుండేవాడు. అతను ధనదత్తు డనే మరొక వర్తకుడి కుమార్తె శ్రీమతి అనే ఆమెను వివాహం చేసుకున్నాడు. కాని ఆమె వల్ల సంతానం కలగకపోగా, ఒక గ్రామంలో ఉండిన పేద ఇంటి పిల్లను పుష్ప అనే దాన్ని ఉపపత్నిగా కొనుక్కున్నాడు. అతను ఇద్దరు భార్యలతోనూ కాపరంచేస్తూ, తన తండ్రి అనంతరం వ్యాపారం సాగించాడు.

ఏ కారణం చేతనో కుమారదత్తుడికి వ్యాపారం కలిసిరాలేదు. మూల ధనమంతా పోయి, అతను అప్పుల పాలయాడు. ఆ అప్పులు తీర్చేసరికి ఉండిన స్థిరాస్తి చాలావరకు పోయింది. కుమారదత్తుడు తనకు మిగిలిన దాంతో ఒక మూల ఒక చిన్న ఇల్లు కొనుక్కుని, అతి కష్టంమీద సంసారం ఈదుతూ వస్తున్నాడు.

ఇలా ఉండగా ధనదత్తుడి ఇంట ఏదో శుభకార్యం జరిగింది. అక్కడి నుంచి మనిషి వచ్చి, కుమారదత్తుణ్ణీ, శ్రీమతినీ ఆహ్వానించి తీసుకుపోయాడు. పుష్ప మాత్రం ఇంట్లో ఉండిపోయింది.

మాటల సందర్భాన ధనదత్తుడు అల్లుడి హీనస్థితి వివరంగా తెలుసుకుని, "ఊరికే కూర్చుంటే ఎలా జరుగుతుంది? నేను వెయ్యి వరహాలు మూలధనం ఇస్తాను. దానితో మళ్ళీ చిన్న వ్యాపారం ఏదైనా ఆరంభించు. అది సక్రమంగా సాగితే మరి కొంత పెట్టుబడి పెడతాను," అన్నాడు.

కుమారదత్తుడికి ఎక్కడలేని ఉత్సాహమూ వచ్చింది. అతను శ్రీమతిని కొద్ది రోజులపాటు పుట్టింటనే ఉండనిచ్చి, వ్యాపారం ఏర్పాటు చేసుకున్నాక తీసుకుపోవటానికి నిశ్చయించుకున్నాడు. మామగారిచ్చిన వెయ్యి వరహాల మూట తీసుకుని

వై. మహేశ్వరప్రసాద్



తన స్నేహితుడి ఇంటికి వెళ్ళి, అతనితో ఈ శుభవార్త చెప్పాడు. ఆ స్నేహితుడు అతన్ని భోజనానికి ఉండమన్నాడు.

కుమారదత్తుడు స్నేహితుడి ఇంటి నుంచి బయలుదేరి తన ఇల్లు చేరుకునేసరికి అర్ధ రాత్రి అయింది. పుష్ప గాఢనిద్రలో ఉండి, చాలాసేపు తలుపు తట్టిన మీదటగాని లేవ లేదు. చివర కామె లేచి తలుపు తెరిచాక, "అంత మొద్దు నిద్రేమిటి?" అంటూ కుమారదత్తుడు వరహాల మూటను మంచం మీద పెట్టాడు.

"ఎక్కడిది ఇంత డబ్బు?" అని పుష్ప ఆశ్చర్యంతో అడిగింది.

"నిన్ను ఒక స్నేహితుడికి తాకట్టు పెట్టి తెచ్చాను. ఆ స్నేహితుడు రేపు వచ్చి నిన్ను పట్టుకుపోతాడు," అని చిన్న అబద్ధ మాడాడు కుమారదత్తుడు.

"అయితే నేనిక ఈ ఇంట్లో ఉండనా?" అన్నది పుష్ప కంగారుపడి.

"ఎప్పటికైనా నా చేతికి డబ్బువచ్చి నిన్ను విడిపించుకుంటే తిరిగి వస్తావు. లేదా, నువ్విక అతని దానివే!" అంటూ కుమారదత్తుడు నిద్రపోయాడు.

పుష్ప పల్లెటూరి మనిషి, అమాయకు రాలు. ఇంకెవరో వచ్చి తనను మరొక ఇంటికి తీసుకు పోతాడంటే, ఆ మనిషి ఎటువంటివాడో, ఆ ఇల్లు ఎలాటిదోనని ఆమెకు భయంవేసింది. కుమారదత్తుడే తన భర్త అనీ, ఈ ఇల్లే తన ఇల్లనీ అనుకుంటూ ఉండటంచేత ఆమెకు ఇప్పుడు భర్త చెప్పిన ఈ మాటతో మతిపోయినట్టయింది.

"మా నాన్నా, అమ్మా ఏమంటారో అడగాలి," అనుకుని పుష్ప చప్పుడు కాకుండా బయటికి వచ్చి, తల వాకిలి తలుపులు దగ్గిరిగా వేసింది.

అర్ధరాత్రి వేళ నగరం నిర్జనంగానూ, నిశ్శబ్దంగానూ ఉండి, బావురుమంటున్నది. వీధి వెంట కొద్ది దూరం నడిచాక ఆమెకు






ఇక ముందుకు పోవటానికి భయంవేసింది. కనీసం తూర్పు తెల్లవారితేగాని తాను ఊరు దాటి తన పుట్టింటిదారి పట్టలేననుకుని, ఆమె తానెరిగిన వాళ్ళ ఇంటి తలుపు తట్టింది. ఆ ఇంటివాళ్ళు తలుపు తెరిచి, "ఇదేమిటి, పుష్పా! ఈ వేళగాని వేళ ఇలా వచ్చావేం?" అని అడిగారు.

"అవును. నన్ను నా భర్త నిష్కారణంగా ఎవరికో తాకట్టుపెట్టాడు. నేను మా వాళ్ళ ఊరు వెళ్ళి, వాళ్ళేమంటారో తెలుసుకోవాలి. నేను ఆయనకు తెలియకుండా బయలుదేరాను. తెల్లవారాక ఆయనతో చెప్పండి, నేను మా పుట్టింటికి వెళ్ళానని. తూర్పు తెల్లవారేదాకా ఇక్కడ మీ పంచలో నడుం వాలుస్తాను," అన్నది పుష్ప.

ఇంటివాళ్ళు సరేనన్నారు. ఆమె కోడి కూసేదాకా కలత నిద్రపోయి, ఆ తరవాత ఇంటివాళ్ళతో చెప్పి తన తల్లిదండ్రుల గ్రామానికి బయలుదేరింది. బాగా తెల్లవారే సరికి ఆమె నగరం దాటి మైలుదూరం కూడా పోలేదు. అప్పటికే ఆమెకు కాళ్ళు పట్టుకుపోయాయి. అందుచేత ఆమె దారి పక్కన చతికిల బడింది.

కొద్దిసేపటికి అటుగా ఒక యువకుడు వచ్చాడు. అతను కూడా వలభీ నుంచే వస్తున్నాడు. ఆ క్రితం రోజు అతను వలభీలో సరుకులు అమ్మి డబ్బు చేసుకుని, తన గ్రామానికి తిరిగి పోతున్నాడు. అత నుండే గ్రామం పుష్ప తల్లిదండ్రుల గ్రామానికి కొంచెం ఎగువగా ఉన్నది. అందుచేత ఇద్దరూ కలిసే నడకసాగించారు.

పుష్ప తన ఇంటి తలవాకిలి తలుపులు చేరవేసి వీధివెంట కొంతదూరం నడిచి మరొక ఇంట్లోకి ప్రవేశించటం ఒక దొంగ చూశాడు. ఆమె తిరిగి వస్తుందేమో నని కొంత సేపు వేచి ఉండి, ఆ దొంగ కుమారదత్తుడి ఇంట్లోకి చల్లగా జొరబడ్డాడు. లోపల దీపం వెలుగుతున్నది. పడక గదిలో ఒక

మనిషి నిద్రపోతున్నాడు. మంచం మీద వరహాల మూట ఉన్నది.

దొంగ ఆత్రంగా ఆ మూట తీసుకో బోయాడు. అంతలో కుమారదత్తుడు చివాల్న లేచి కూర్చుని, "ఎవడ్రా నువ్వా?" అంటూ దొంగను పట్టుకున్నాడు. దొంగ ఆ పట్టు తప్పించుకుని, పారిపోయే ఉద్దేశంతో మరొక గదిలోకి పరిగెత్తాడు. కుమారదత్తుడు వాణ్ణి వెంటాడి వచ్చి మళ్ళీ పట్టుకున్నాడు. దొంగకు దైవికంగా ఆ గదిలో ఒక మడ్డుకత్తి కనిపించింది. వాడు చప్పున దాన్ని అందుకుని కుమారదత్తుడి నెత్తిన ఒకటి పెట్టి పారిపోయాడు. కుమారదత్తుడు ఆ క్షణంలోనే ప్రాణాలువిడిచాడు.

తెల్లవారింది. పుష్ప పడుకున్న ఇల్లుగల వాళ్ళు కుమారదత్తుడితో పుష్ప చెప్పమన్న కబురు చెబుదామని వచ్చి అతని శవాన్ని చూశారు. కుమారదత్తుణ్ణి ఎవరో హత్యచేసి, అతని వరహాల మూటను కాజేశారన్న వార్త అధికారులకు తెలిసింది. సహజంగా అనుమానం పుష్ప మీదికే వెళ్ళింది. రక్షకభటులు ఆమె వెళ్ళిన మార్గాన వెళ్ళి ఆమెనూ, ఆమెతో కలిసి ప్రయాణం చేస్తున్న యువకుణ్ణీ పట్టుకున్నారు. అతని వద్ద కూడా వెయ్యి వరహాలున్నాయి. పుష్పా, ఆమె వెంట ఉన్న యువకుడూ కుమారదత్తును హత్య చేసి డబ్బు కాజేశారని న్యాయాధిపతి నమ్మి ఆ ఇద్దరికీ మరణదండన విధించాడు. పుష్ప నిజమే చెప్పినా ఎవరూ నమ్మలేదు.

వాళ్ళను ఉరి తీయబోయే సమయంలో అసలు దొంగ ముందుకు వచ్చి తానే హంతకుణ్ణనీ, ఆత్మరక్షణకుగాను తాను హత్య చేయవలసి వచ్చిందనీ చెప్పాడు. దొంగ చెప్పినది పుష్ప చెప్పిన దానికి సరిపోయింది. ఇద్దరి ప్రాణాలను కాపాడినందుకు న్యాయాధిపతి దొంగను క్షమించి విడిచి పెట్టేశాడు.





# పాతాళదుర్గం

## 15

[పొట్టిరాక్షసుడు చేసిన సహాయం వల్ల, ధూమకుడూ అతడి అనుచరులు కందకంలోని రహస్య సొరంగమార్గం చేరారు. దారిలో వారికి కొందరు రాక్షసబ్బంట్లు ఎదురయ్యారు. వాళ్ళ నుంచి తప్పించుకుని ధూమకుడూ వాళ్ళు సొరంగద్వారాన్ని సమీపించగానే, ఏనుగులు పూన్చిన రథంలో పోతున్న ఒక గొప్ప రాక్షసుడు వాళ్ల కంటబడ్డాడు. తరవాత—]

ఏనుగులు లాగుతున్న రథం తమ దృష్టి నుంచి పోగానే, ధూమకుడు తన ఇద్దరు అనుచరుల ముఖాల కేసీ చూశాడు. వాళ్ళు భయపడుతున్నారో, ఆశ్చర్యపడుతున్నారో తెలుసుకోవాలన్నదే అతడి ప్రయత్నం. ఎందుకంటే, తాము ఎలాగైతేనేం మహాకలి రాక్షసు డుండే దండకారణ్యం చేరారు. శత్రువుల వల్ల నిజమైన కష్టాలు ప్రారంభ మయే దిప్పుడే.

సోమకుడు విల్లంబులు గట్టిగా గుప్పెట బిగించి కన్నార్పకుండా, రాక్షసుడు పోయిన మార్గం కేసి చూస్తున్నాడు. విరూపుడు ఈటెమొనను వేళ్ళతో నిమురుతున్నాడు. వాళ్ళల్లో భయచిహ్న లేమీ లేవు, ఇద్దరూ పళ్ళు గట్టిగా బిగించి వున్నారు.

"ఆ రథంలో పోయినవాడు మహాకలి—పాతాళదుర్గంరాజు అనేదాంట్లో సందేహం లేదు," అన్నాడు ధూమకుడు.



"నేనూ అలాగే అనుకుంటున్నాను. నువ్వు ఊఁ అన్నట్టయితే, ఒక్క బాణం దెబ్బతో వాణ్ణి రథం మీది నుంచి కింద పడకొట్టేవాణ్ణి," అన్నాడు సోమకుడు.

"అది ప్రమాదం. వాడు చచ్చినా, వాడి రథం వెనక నడిచే ఆయుధంగాళ్ళందరూ మన మీదికి వచ్చి పడేవాళ్ళు. ఆ దుర్మార్గుణ్ణి హతం చెయ్యటానికి, యింత కన్న సులువైన మార్గం ఏదైనా ధూమక బాబు ఆలోచించాలి," అన్నాడు విరూపుడు.

విరూపుడి ముందు చూపూ, ఇంగిత జ్ఞానం ధూమకుడికి చాలా సంతోషం కలిగించింది. పులిందుడు తమ వెంట లేక పోవటం అన్నివిధాలా మేలే అయింది, అనుకున్నాడు ధూమకుడు. అతడే తమ వెంట వుంటే, మహాకలిని చూస్తూనే, నా పడుచు పెళ్ళాం భామాసింగిని ఎక్కడ దాచావురా? అంటూ అతడి మీదికి బల్లెం తీసుకుని కుప్పించి దూకేవాడే!

"ఈ సొరంగమార్గం నుంచి శత్రువుల కంటబడకుండా బయటపడగలిగితే, యిక అరణ్యంలో మన నెవరూ పట్టుకోలేరు. జాగ్రత్తగా వినండి; సొరంగద్వారానికి ఎవరో కాపలా వున్నారు. వాళ్ళు అటూ యిటూ నడిచే ధ్వని మీకు వినబడటం లేదా?" అని అడిగాడు ధూమకుడు.

విరూపుడూ, సోమకుడూ కొంచెంసేపు నిశ్శబ్దంగా వుండి విని, "ఒకళ్ళ కన్న ఎక్కువమందే కాపలావున్నట్టుంది. వాళ్ళు మాట్లాడుకోవటం కూడా అస్పష్టంగా వినబడుతున్నది," అన్నారు.

"ముందు కాపలావాళ్ళ సంగతేమిటో తేల్చుకోవటం మంచిది. మనం యిక్కడ జాగుచేస్తే, మరికొందరు రాక్షసబ్బంట్లు సొరంగమార్గంలో ప్రవేశించవచ్చు, లేక యింతకు ముందు పోయినవాళ్ళు తిరిగి రావచ్చు," అంటూ ధూమకుడు రాళ్ళ చాటుగా పాకుతూపోయి, సొరంగద్వారం



దాటి చుట్టూ కలయచూశాడు. ద్వారానికి ఒకపక్కగా వున్న ఒక పెద్ద చెట్టు కింద ఒక రాక్షసుడూ, నలుగురు మానవబంట్లూ వున్నారు. ఆ అయిదుగురూ ఏదో సంగతి తీవ్రంగా చర్చిస్తున్నారు. మధ్య మధ్య బంట్లల్లో ఒకడు వాళ్ళ నుంచి దూరంగా పోయి, చేతిలో వున్న కత్తిని సాము గరిడీల్లో తిప్పినట్టు గిరగిరా తిప్పుతున్నాడు.

ధూమకుడు వాళ్ళను చూసి కొంచెం నిస్పృహ చెందాడు. శత్రువుల కనుగప్పి సొరంగం నుంచి బయటపడి అరణ్యంలోకి పారిపోవటం అసాధ్యంలా కనిపించిం దతడికి. ఇప్పుడేమిటి చేయటం? ధూమకుడిలా మథనపడుతూ తిరిగి తన అనుచరుల కేసి రాబోయేంతలో, దూరంగా ఎవరో శంఖాన్ని బలంగా పూరించిన ధ్వని వినబడింది. ఆ ధ్వని వింటూనే సొరంగ మార్గం కాపలావాళ్ళు నలుగురూ చెట్టు కింది నుంచి బయలుదేరారు. కత్తిసాము చేస్తున్నవాడు సాము ఆపి, సొరంగద్వారం కేసి రాసాగాడు.

ధూమకుడు గబగబా తన అనుచరుల దగ్గిరకు వచ్చి సంగతంతా నాలుగు ముక్కల్లో చెప్పి, "ఆ దుర్మార్గులు మధ్యాన్న భోజనానికో, సాయంకాలప్పిం




డానికో పోతున్నట్టున్నది. ఆ శంఖధ్వని అందుకు పిలుపై వుంటుంది. వాళ్ళల్లో ఒకడిటొస్తున్నాడు," అన్నాడు.

ఇంతలో రాక్షసబ్బంటు సొరంగద్వారం దగ్గిరకొచ్చి అనుమానంగా లోపలికి తొంగి చూస్తూ, "ఏదో గుసగుస వినపడుతున్నదే, ఎవరక్కడ? రాక్షసదొరలా? మానవ కీటకాలా?" అంటూ ప్రశ్నించాడు.

ధూమకుడు తన మిత్రులకు ఆ బంటు సొరంగంలోకి దిగగానే చుట్టుముట్టమని హెచ్చరించి రాతిచాటునే వుండి చిన్నగా దగ్గాడు. ఆ ధ్వని వింటూనే బంటు, "ఏయ్, నాతో పరాచకాలా?" అంటూ





కత్తి తిప్పుతూ సొరంగంలోకి దూకాడు. మరుక్షణంలో అక్కడున్న ముగ్గురూ రాళ్ళ చాటు నుంచి లేచి అతణ్ణి చుట్టుముట్టి, "కత్తి కిందపడెయ్, నీకొచ్చిన ప్రాణభయం ఏమీ లేదు," అన్నారు.

"ఎవరూ? జాతితక్కువ మనుషులు! మీకు నేను లొంగిపోవాలా? మీరసలిక్కడికెలా రాగలిగారు? ముందు ఆయుధాలు కింద పడేసి, సాగిలపడండి. నేనెవరో తెలుసా? ఈ దండకారణ్యంలో నన్ను మించిన ఖడ్గవేత్త లేడు," అన్నాడు రాక్షసబంటు.

వాడు మాట ముగించీ ముగించకముందే, ధూమకుడు కత్తిపిడితో ఆ బంటు నెత్తిన



గట్టిగా ఒక దెబ్బ కొట్టాడు. ఆ దెబ్బ తింటూనే వాడు చిన్నగా అరిచి కింద పడిపోయాడు. ధూమకుడు తన అనుచరులతో, "వీణ్ణి మనవెంట అరణ్యంలోకి తీసుకుపోవటం మంచిది. వీడి ద్వారా మహాకలి రాక్షసుడి పాతాళదుర్గ రహస్యాలెన్నో తెలుసుకోవచ్చు," అన్నాడు.

సోమకుడూ, విరూపుడూ కలిసి రాక్షస బంటును లేవనెత్తి భుజాన వేసుకుని బయలుదేరారు. ధూమకుడు ముందుగా సొరంగ ద్వారం దాటి బయటికి వచ్చాడు. అక్కడ శత్రువు లెవరూ లేరు. కాని, గుబురుగా పెరిగిన చెట్లున్న ప్రదేశం చేరాలంటే, నాలుగైదు వందల గజాలదూరం మైదాన ప్రదేశంలో నడవాలి.

"వేగంగా పరిగెత్తాలి. అరణ్యం చేరే వరకూ మనకు రక్షణ లేదు," అంటూ ధూమకుడు తన అనుచరుల్ని హెచ్చరించాడు. వాళ్లు పరిగెత్తబోయేంతలో, అప్పటి వరకూ తిన్నదెబ్బతో మైకంలో పడివున్న రాక్షసబంటు, ఆ మైకం కాస్త వదిలి, "శత్రువులు! శత్రువులు! పట్టుకోండి," అంటూ కేకలు పెట్టసాగాడు.

"కాలయాపన ప్రమాదం. వాణ్ణి ఆ సొరంగంలోనే పడవేసి, నా వెంట పరి

గత్తి రండి," అని ఆజ్ఞాపించాడు ధూమకుడు. ఆ వెంటనే విరూపుడూ, సోమకుడూ, "చావ్వోథవా!" అంటూ రాక్షసబ్బంటును సారంగంలోకి విసిరివేశారు.

వాళ్ళు ముగ్గురూ మైదానం దాటి గుబురుచెట్లున్న ప్రదేశం చేరుకున్నారు. వాళ్ళను రాక్షసుడి కాపలా వాళ్ళెవరూ చూసినట్టులేదు. అరణ్యమంతా నిశ్శబ్దంగా వున్నది. సూర్యుడు పడమటి దిక్కుకు బాగా వాలిపోయాడు. తాము అరణ్యంలో రహస్యంగా జీవిస్తూ, మహాకలిరాక్షసుడి పాతాళదుర్గాన్ని గురించిన రహస్యం తెలుసుకోవాలి. ఆ రాక్షసుడి బంటు ఎవడైనా చెప్పందే, ఆ రహస్యం కనుక్కోవటం సాధ్యంకాదు, అనుకున్నాడు ధూమకుడు.

ధూమకుడు తా నెటుపోతున్నదీ ఆలోచించకుండానే అరణ్యంలోకి చాలా దూరం నడిచి, తన వెనక వస్తున్న అనుచరులతో, "ఈ రాత్రికి మనం అరణ్యంలో దొరికే పళ్ళూఫలాలూ తిని ఆకలి చల్లార్చుకోవలసిందే. మనం ఆ కనబడే కొండల్లో, ఏదైనా మంచి గుహ ఒకటి చూసి నివాసం ఏర్పరుచుకుందాం," అన్నాడు.

సోమకుడు అంగీకార సూచకంగా తల వూపాడు. విరూపుడు చుట్టూ ఓసారి




కలయ చూసి, "ఇంత మహాభయంకరారణ్యం నే నెక్కడా చూడలేదు. మీకు లోగడే చెప్పాను గదా—ఈ అరణ్యంలో ఎక్కడో కాలశంబర మాంత్రిక దొర వున్నాడు. ఆ దొరను కలుసుకుంటే ..."

విరూపుడు మాట ముగించే లోపలే ధూమకుడి దగ్గిరవున్న మంత్రదండం కీచుమంటూ కదిలి, ఎదురుగావున్న కొండల కేసి అతణ్ణి గుంజసాగింది. ధూమకుడు ఎంతో ఉత్సాహంగా, "ఇన్నాళ్ళుగా దీని మాటే మరిచాం, సుమా! మాంత్రికుడు, మహాకలి సేవకులకు దొరకలేదనీ, యిక్కడే ఎక్కడో స్వేచ్ఛగా వున్నాడనీ,



నాకు గట్టి నమ్మకం కలుగుతున్నది. బహుశా, ఆ కనబడే కొండప్రాంతాల వుండి వుంటాడు," అంటూ వాటి కేసి ఓ క్షణ కాలం చూసి, "మనం చీకటిపడే లోపల అక్కడికి చేరటం మంచిది. మీరు చెట్లెక్కి చుట్టుపక్కల రాక్షసబ్బంట్లెవరైనా వున్నారేమో చూడండి," అన్నాడు.

సోమకుడూ, విరూపుడూ అక్కడ వున్న ఒక ఎత్తయిన చెట్టు మీదికి గబగబా పాకిపోయి, నాలుగైదు నిమిషాలపాటు ఆ చుట్టుపక్కల అంతా పరీక్షించి చూసి, ఘడావిడిగా చెట్టు దిగి వచ్చారు. ముందుగా విరూపుడు, ధూమకుణ్ణి సమీపించి,

"ధూమకదొరా! నా కళ్ళనే నేను నమ్మలేకపోయానంటే, నమ్ము. రాక్షసులూ, వాళ్ళ బంట్లూ అరణ్యంలో అక్కడక్కడా చెట్లు నరికి వ్యవసాయం చేస్తున్నారు. భూమి దున్నటానికీ, బళ్ళు లాగటానికీ వాళ్ళుపయోగిస్తున్న జంతువు లేమిటో తెలుసా? ఏనుగులూ, సింహాలూ, లొట్టి పిట్టలూ!" అన్నాడు.

"మనుషుల్నీ, జంతువుల్నీ పీక్కుతినే రాక్షసులు భూమి దున్ని సేద్యం చేస్తున్నారా? ఆశ్చర్యంగా వుంది. సరే, మనం శత్రువుల కంటబడకుండా కొండప్రాంతం చేరవచ్చా?" అన్నాడు ధూమకుడు.

"ఆ దుర్మార్గులు ఎవరి పనుల్లో వాళ్ళున్నారు. వ్యవసాయప్పనిముట్లు తప్ప, ఎవరి చేతిలోనూ ఆయుధాలు లేవు. పనిలోపని కొందరి గొంతుల్లో బాణాలు గుచ్చమంటావా?" అన్నాడు సోమకుడు.

"తొందరపడి అలాంటి పొరపాటు చేయకు. మనం యిక్కడ వున్నట్టు ముందుగానే శత్రువుకు హెచ్చరిక యిచ్చిన వాళ్ళమవుతాం. ఇక జాగ్రత్తగా నడవండి, మంత్రదండం గింజుకుంటూ చూపే, ఆ కొండ కేసి," అంటూ ధూమకుడు బయలుదేరాడు.

అంతలో సొరంగద్వారం వైపున పెద్ద కోలాహలం బయలుదేరింది. ఆ వెంటనే ముగ్గురూ చెట్టెక్కి, అక్కణ్ణించి సొరంగం కేసి చూశారు. దానిముందు కొందరు రాక్షసులూ, వాళ్ళ బంట్లూ గుంపుగా చేరి వున్నారు. వాళ్ళ మధ్య 'ఖడ్గవేత్త'నని బీరాలు పలికిన బంటును యిద్దరు ముగ్గురు పట్టుకుని నిలబెట్టారు. వాడు అయాసపడుతూ చుట్టూ చేరిన వాళ్ళకు ఏమేమో చెపుతున్నాడు.

"సోమూ, విరూపా, వాడు మనను గురించే వాళ్ళకు ఏదో చెపుతున్నాడు. రాక్షసులు క్షణాల మీద అరణ్యంలో మన వేట ప్రారంభిస్తారు. పదండి, ఆ కొండ కేసి పరిగెత్తండి," అంటూ ధూమకుడు చెట్టు మీంచి దూకి పరుగు ప్రారంభించాడు.

దాదాపు అర గంటకాలం వెనక్కు తిరిగి చూడకుండా ఆ ముగ్గురూ అరణ్యంలో పరిగెత్తి, చివరకు కొండపాదం చేరారు.

ఆ కొండ మీదా, దిగువనా కూడా పెద్ద పెద్ద వృక్షాలూ, పొదలూ క్రిక్కిరిసి వున్నవి. ఎదురుగా వారికి ఒక చిన్న జలపాతం కనిపించింది. దాన్ని చూస్తూనే సోమకుడు, "అబ్బా, దాహంగా వుంది! శత్రువుల మాట దేవు డెరుగు," అంటూ నీటిలోకి దిగి దాహం తీర్చుకోసాగాడు. చప్పున జలపాతం కట్టుబడిపోయింది. అప్పటివరకూ నీరు ప్రవహించిన చోట నిలువెత్తున, ద్వారంవున్న సూచనగా గుర్తులు కనిపించినై. అబ్బురపడుతూ దాని కేసే కళ్ళార్పకుండా చూస్తున్న ఆ ముగ్గురికీ ఆ ప్రదేశాన కాలశంబర మాంత్రికుడి రూపం ఛాయలా కనిపించింది. మంత్రించినట్టు ముగ్గురూ నిశ్శబ్దంగా దాన్ని సమీపించేంతలో ద్వారం తెరుచుకున్నది. అదొక గుహ. లోపల అగ్నిజ్వాలలు భగ్గుభగ్గుమంటూ ప్రజ్వరిల్లుతున్నవి.

—(ఇంకా వుంది)





# ఆపద్రక్షకుడు

పట్టు వదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టు పై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవం లోని బేతాళుడు, "రాజా, నీలాటి భోగజీవి ఇలా కష్టాల నెదుర్కోవటం చాలా అరుదు. నాగేంద్రుడిలాటి కోటీశ్వరుడే ఆపత్కాలంలో తన సేవకుడి రక్షణ పొందవలిసి వచ్చింది. శ్రమతెలియకుండా నీ కా కథ చెబుతాను విను," అంటూ ఈ విధంగా చెప్పసాగాడు:

నాగేంద్రుడు పశ్చిమతీరవాసి. అతను వర్తకం చేసి కోటీశ్వరుడయాడు. ఆయనకు సచివు డనే కుమారుడూ, సులోచన అనే కుమార్తే ఉండేవారు. నాగేంద్రుడు ధనికుడే గాక, ధర్మబుద్ధి గలవాడూ, న్యాయవర్తనుడు కూడానూ.

నాగేంద్రుడి ఇంట సమీరు డనే యువకుడు సేవకుడుగా ఉండేవాడు. అతను తన

బేతాళ కథలు



యజమాని అంటే ఎంతో శ్రద్ధాభక్తులూ, గౌరవం కలవాడు. గృహకార్యాలు చెయ్యటంలో నేర్పరి. నాగేంద్రుడి కుటుంబానికి నమ్మినబంటు.

ఒకసారి నాగేంద్రుడి బావమరిది తన కుమార్తెకు పెళ్ళిచేస్తూ తన చెల్లెలి కుటుంబానికి ఆహ్వానం పంపాడు. పెళ్ళికి వెళ్ళాలంటే సముద్రం మీద వెళ్ళాలి. నాగేంద్రుడు తన భార్యనూ, బిడ్డలనూ, తమ సేవకుడైన సమీరుణ్ణీ వెంట తీసుకుని తన సొంత ఓడలో బయలుదేరి బావమరిది ఉండే దేశానికి వెళ్ళాడు. వివాహం జరిగింది. అక్కడి నుంచి నాగేంద్రుడి కుటుంబం తిరుగు ప్రయాణం చేస్తూ ఉండగా సముద్రం మీద పెద్ద తుఫాను లేచి, ఓడ గాలి వేగానికి దారీతెన్నూ లేకుండా కొట్టుకుపోయి ఒక నిర్జనమైన లంకలో ఉన్న కొండలకు తగిలి పగిలిపోవటం జరిగింది.

అష్టయిశ్వర్యాలతో పెరిగిన నాగేంద్రుడి కుటుంబానికి ఆ నిర్జన ద్వీపంలో ఎట్లా జీవించాలో కొంచెంకూడా తెలీదు. మనిషికి కావలిసిన కనీసావసరాలైన తిండీ, బట్టా, ఇల్లూ కూడా వారికి లేవు. వాటని ఎట్లా సాధించాలో వారికి తెలీదు. అటువంటి విషాద పరిస్థితిలో సమీరుడు వారికి ఆపద్రక్షకుడయాడు.

అతను పగిలిన ఓడలో నుంచి పరికరాలు తెచ్చి, చెట్లుకొట్టి కలపతో ఇల్లు తయారు చేశాడు. మృగాలను వేటాడి తెచ్చి అందరికీ ఇంత తిండి ఏర్పాటు చేశాడు. జంతువుల చర్మాలు కట్టుబట్టలుగానూ, పక్కలుగానూ తయారు చేశాడు.

ఈ విధంగా సమీరుడు నాగేంద్రుడి కుటుంబాని కంతకూ నాయకత్వం వహించి, గౌరవనీయుడయాడు. అతను చెప్పినట్టు నడుచుకోవటం మిగిలినవాళ్ళకు క్షేమంగా ఉండటంచేత ఎవరూ అతనికి ఎదురుచెప్పే వారుకారు.

ఇట్లా కొద్ది సంవత్సరాలు గడిచాయి. సూర్యోదయం లగాయతు సూర్యాస్తమయం దాకా, సముద్రతీరాన ఉన్న కొండ శిఖరం మీద ఎవరో ఒకరు నిలబడి ఉండి, ఏ దారే పోయే ఓడగాని కనుచూపు మేరలోకి వస్తుం దేమోనని చూడాలని సమీరుడు అందరికీ నియమం పెట్టాడు. కాని ఒక్క ఓడ కూడా అటుగా రాలేదు.

నాగేంద్రుడి కుటుంబం తమ పాత జీవితాన్ని దాదాపు మరిచిపోయి, కొత్త జీవితానికి అలవాటు పడ్డారు. ఈ సమయంలోనే నాగేంద్రుడి కుమార్తె సులోచన యుక్త వయస్కురాలయింది. ఆమెను సమీరుడి కిచ్చి చెయ్యాలని నాగేంద్రుడు నిశ్చయించాడు. ఇందుకు సులోచనతో బాటు మిగిలిన వాళ్ళు కూడా సంతోషించారు.

ఈ నిర్ణయం జరిగిన కొద్ది రోజులకే ఒక ఓడ ఆ ద్వీపం కేసి వచ్చింది. అది అటుగా వచ్చేసమయానికి సమీరుడే కొండ మీద ఉన్నాడు. అతను ఓడను దూరాన చూడగానే ఎండు చితుకులు మంటచేసి, పొగ బాగా రావటానికి అందులో పచ్చి కట్టెలు వేశాడు. ఆ పొగ ఓడలో వాళ్ళను ఆకర్షించింది. వాళ్ళు ఓడను ద్వీపం దగ్గిరికి నడిపారు.



ఆ ఓడ మరొక వర్తకుడిది. నాగేంద్రుడి కుటుంబం సముద్రానికి బలి అయినట్టు ఆయన విని ఉన్నాడు. వారంతా ప్రాణాలతో ఉండటం తెలుసుకుని, వారిని అభినందించి, వారిని తన ఓడలో ఎక్కించుకుని, వారి దేశం చేర్చాడు.

తిరిగి నాగేంద్రుడి కుటుంబం నాగరికతలో పడ్డారు. దేశానికి తిరిగి వచ్చిన మర్నాడే సమీరుడు నాగేంద్రుడి వద్దకు వెళ్ళి, నమస్కారం చేసి, "నాకు శలవిప్పించండి," అన్నాడు.

మొదట నాగేంద్రుడు వెళ్ళవద్దని పేచీ పెట్టాడుగాని, సమీరుడు వెళ్ళి పోవాలనే

పట్టుదలతో ఉన్నట్టు గ్రహించి, అతనికి పుష్కలంగా ధనమిచ్చి పంపేశాడు.

బేతాళు డీ కథ చెప్పి, "రాజా, నాకొక సందేహం. స్వామిభక్తి గల సమీరుడు కష్ట కాలంలో తన యజమానికి అంతగా సహాయ పడి, ఆ యజమానికి మంచి రోజులు రాగానే ఎందుకు వెళ్ళిపోయాడు? అతనికి సులోచననిచ్చి పెళ్ళిచెయ్యాలన్న నిర్ణయం కూడా జరిగింది కదా. ఆడితప్పని నాగేంద్రుడు తప్పక తన కుమార్తెను అతని కిచ్చి పెళ్ళి చేసేవాడే కదా. ఆ అవకాశాన్ని కూడా సమీరుడు ఏకారణాల వల్ల వదులు కున్నాడు? ఈ ప్రశ్నలకు సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో నీ తల పగిలి పోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "నిర్జనద్వీపం మీదికి వెళ్ళగానే అందరి సంబంధాలూ, మనస్తత్వాలూ మారిపోయాయి. అక్కడి జీవితంలో నాగేంద్రుడు యజమానీ కాడు, సమీరుడు సేవకుడూ కాడు. కొత్తగా ఏర్పడిన సంబంధాల మూలానే నాగేంద్రుడు తన కుమార్తెకూ, సమీరుడికీ పెళ్ళి చేద్దామనుకున్నాడు. ఇంతలో వారి ఆపద తొలగింది. వారు పాత జీవితానికి తిరిగి వచ్చారు. కాని పాత సంబంధాలు తిరిగి రావటం సాధ్యంకాదు. సమీరుడు బంటు గానూ ఉండలేడు, నాగేంద్రుడు యజమా నిగా అతని చేత పనులు చేయించుకోనూ లేడు. ధర్మబుద్ధి గలవాడు కనక, అన్న మాట నిలబెట్టుకునేటందుకు ఆయన తన కుమార్తెను సమీరుడి కిచ్చి చెయ్యవచ్చు. కాని ఆ వివాహం సులోచనకూ సుఖం చేకూర్చదు, సమీరుడికి అంతకన్నా చేకూర్చదు. ఈ చిక్కులన్నీ ఆలోచించే సమీరుడు వెళ్ళిపోయాడు," అన్నాడు.

రాజు కీ విధంగా మౌనభంగం కలగ గానే బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. (కల్పితం)






# ధర్మబుద్ధి గల ఖలీఫా

మహమ్మద్ ప్రవక్త ఇస్లాంమతాన్ని ప్రబోధించిన ఫలితంగా అనాగరికంగానూ, ఆదిమ వాసులలాగానూ జీవిస్తూ ఉండిన అరేబియా ఎడారి వాసులు సంస్కృతీ నాగరికతలను నిర్మించుకున్నారు, బలసంపన్నమైన సామ్రాజ్యాన్ని ఏర్పరచుకున్నారు. వారిని మొట్ట మొదట పాలించినవారు ఖలీఫాలు. రాను రాను ఈ ఖలీఫాలు అంతులేని సంపదలకు అధిపతులై భోగాలలో మునిగి తేలినప్పటికీ, తొలి ఖలీఫాలు న్యాయాన్నీ, నీతినీ, ధర్మాన్నీ ఎంతో పవిత్రంగా భావించి, వాటికి విధేయులై నడుచుకున్నారు.

ఖలీఫా ఉమర్ అలాటి ఆదర్శ వ్యక్తి. అతని కొలువులోకి ప్రవేశించ గోరినవారు బరువులు మోసే జంతువులను సవారీకి ఉపయోగించమనీ, శత్రువులను దోచుకోమనీ, ప్రార్థనలకు ఆలస్యంగా వెళ్ళమనీ ప్రమాణాలు చెయ్యవలసి ఉండేది.

"తెలివే సంపద; బుద్ధిసూక్ష్మమే అంగరక్ష; అధ్యయనమే కీర్తి," అని అయన ఎప్పుడూ అంటూండే వాడట.

ఉమర్ ఖలీఫాగా ఉండగా ముఐకిబ్ అనే వృద్ధుడు ఆయన కోశాధికారిగా ఉండేవాడు. ఒకసారి ఉమర్ కొడుకు తన దాది వెంట కోశాధికారి ఇంటికి వెళితే, ముఐకిబ్ ఆ కుర్రవాడికి ఒక కొత్త వెండి దిరహమ్ నాణెం ఇచ్చాడు.

తరవాత ఉమర్ తన కోశాధికారిని పిలిచి, "ఏం పని చేశావ్?" అన్నాడు.

ముఐకిబ్ కంగారుపడుతూ, "నా వల్ల ఏమి అపచారం జరిగింది?" అని అడిగాడు.

"నా కొడుక్కు వెండి దిరహం ఇవ్వటమంటే ముసల్మాను జాతినంతా దోచటమే గదా!" అన్నాడు ఉమర్.

"అంత న్యాయబుద్ధి గలవాడు మరొకడెవడుంటాడు?" అని ముఐకిబ్ ఉమర్‌ను

బి. ఈశ్వరదాసు

గురించి తన జీవితాంతం వరకూ అంటూనే ఉండేవాడు.

ఒక రాత్రి ఖలీఫా ఉమర్, అస్లం అబూ జైద్‌ను వెంటబెట్టుకుని నగరంలో నడుస్తూండగా దూరాన ఏదో మంట కనిపించింది. దగ్గిరికి వెళ్ళి చూస్తే, ఒక పేదరాలు పొయి మండించి కుండలో ఏదో కాస్తూండటం కనిపించింది. ఆమె సమీపంలో ఇద్దరు అర్భకపు పిల్లలు ఏడుస్తున్నారు.

"ఏం చేస్తున్నావు?" అని ఉమర్ ఆ పేదరాలి నడిగాడు.

"నా పిల్లలు చలితోనూ, ఆకలితోనూ చస్తున్నారు. వాళ్ళ కోసం నీరు కాస్తున్నాను. మా దీనస్థితి గురించి అల్లా, ఖలీఫా ఉమర్‌ను అడగకపోడు," అన్నదామె.

"నీ దీనస్థితి తెలిస్తే ఖలీఫా చూస్తూ ఊరుకుండేవా డనుకుంటున్నావా?" అని ఉమర్ అడిగాడు.

"తన ప్రజలలో ప్రతి ఒక్కరి కష్టాలూ తెలుసుకోలేనివాడు ఖలీఫాగా ఎందుకుండాలి?" అని ఆ పేదరాలన్నది.

ఉమర్ తన భవనానికి తిరిగివచ్చి ఒక సంచీడు పిండీ, ఒక జాడీడు గొర్రెకొవ్వూ, తీసుకున్నాడు. "వీటిని కాస్త నా వీపు మీది కెక్కిస్తావా?" అని ఆయన అబూజైద్‌ను అడిగాడు.



"వాటిని నేను మోసుకొస్తానులెండి," అన్నాడు అబూజైద్.

"తీర్పు చెప్పేనాడు నా పాపాలు కూడా నీవే మోస్తావా?" అని ఖలీఫా అడిగాడు.

తరవాత ఆయన వాటిని తానే ఆ పేద రాలి దగ్గిరికి మోసుకుపోయి, పొయి మీది కుండలో ఇంత పిండీ, ఇంత కొవ్వూ వేసి కలిపి, తానే వంటచేస్తూ, తానే పొయ్యిఊది మంటకూడా చేశాడు. కట్టెలపొగ ఆయన గడ్డం అంతా అలుముకున్నది.

వంట తయారైనాక ఆయన ఆ పేద రాలినీ, ఆమె బిడ్డలనూ వద్దన్నదాకా తిని పించాడు. ప్రతిముద్దా తానే ఊది చల్లార్చి వారికి పెట్టాడు. మిగిలిపోయిన పిండీ, కొవ్వూ ఆ స్త్రీ కిచ్చేసి తిరిగివస్తూ ఆయన అబూ జైద్‌తో, "మంట కనిపించింది, జ్ఞానోదయ మయింది," అన్నాడు.

ఒకనాడు ఉమర్ వెళుతూండగా దారిలో ఒక బానిసవాడు తన యజమాని గొర్రెల మందను కాస్తూ కనిపించాడు. ఉమర్ ఆగి, గొర్రెలు కాసేవాణ్ణి తన కొక గొర్రెను అమ్మ మని అడిగాడు. ఆ గొర్రెలు తనవికావని వాడన్నాడు.

"మంచివాడివి. నేను నిన్నే కొని దాస్య విముక్తి కలిగిస్తాను. నీ అంత నీతిగలవాళ్ళు నిత్యమూ కనిపించరు," అన్నాడు ఉమర్.



ఒకనాడు ఉమర్ వద్దకు ఆయన బంధువు హఫ్సా అనే ఆమె వచ్చి, "కిందటి యుద్ధంలో నీకు చాలా ధనం చిక్కిందిట. ఆ సంగతి యిప్పుడే తెలిసింది. బంధుత్వ రీత్యా అందులో కొంచెం అడిగి పుచ్చుకుందామని వచ్చాను," అన్నది.

"హఫ్సా, ముసల్మానుల సొత్తుకు రక్షకుడుగా నన్ను అల్లా నియమించాడు. ఈ ధనమంతా వారిది. నా తండ్రివైపు దానివని నీ సంతోషం కోసం ఇందులో కొంత నీకివ్వటం సాధ్యం కాదు సరే కదా, దీన్ని నేను కూడా తాకటానికి సాధ్యం కాదు," అన్నాడు ఉమర్.

ఉమర్ ఒకనాడు మట్టిలో కూర్చుని ప్రజలకు మతప్రబోధ చేస్తూ ఉండగా మస్లమా అనేవాడు, "ఖలీఫా, నీ అంతవాడిలా మట్టిలో కూర్చుని ప్రబోధం చెయ్యటం అనుచితం. కనీసం ఒక బాలీసు నానుకుని అయినా కూర్చోండి," అన్నాడు.

"నాయనా, నా ఆత్మ సమాధి నుంచి లేచే నాడు దాని మెడకొక బాలీసు వేళ్ళాడుతూ ఉండటం మంచిదని నీ ఉద్దేశమా?" అన్నాడు ఉమర్. ఆ కాలంలో సామాన్య ప్రజలలో కూడా వివేకం హెచ్చుగా ఉన్నట్టు కనిపిస్తుంది. ఖలీఫా ఉమర్ కాలంలోనే ఈ సంఘటన జరిగింది:

ఒకనాడు ఒక మనిషి తన గొర్రెమందను కాస్తూండగా అతని వద్దకు అతని మిత్రుడైన యువకు డొకడు వెళ్ళి, మంద మధ్యన రెండు భయంకరమైన కుక్కలలాటి జంతువులను చూసి, "ఆ కుక్కలను మంద మధ్య ఉంచావేమిటి?" అని అడిగాడు.

"అవి కుక్కలు కావు. మచ్చిక అయిన తోడేళ్ళు. ఈ మందకు నేను యజమానిని, అందుచేత అవి ఏమీ హానిచెయ్యవు. తలలో చెడు ఏమీ లేకపోతే దేహమంతా మంచిగానే ఉంటుంది!" అన్నాడు మంద గలవాడు.





# కన్నప్రేమ

ఒక ఊళ్ళో రామయ్యా, గోపమ్మా అని దంపతులుండేవారు. వారికి ఊరి నానుకుని కొంత పొలం ఉండేది. ఆ పొలంలోనే ఒక కుటీరం వేసుకుని, తమకు కావలిసినదంతా పండించుకుంటూ హాయిగా వారు జీవిస్తూ ఉండేవారు.

వారికి ఒకటే చింత ఉండేది—సంతానం లేదు. పిల్లల కోసం గోపమ్మ ఎందరో దేవుళ్ళకు మొక్కింది, పూజలు చేసింది, ముడుపులు కట్టింది. చివరకు ఏ దేవుడో అనుగ్రహించగా వాళ్ళకు నడివయసులో ఒక కొడుకు కలిగాడు.

ఆ నలుసును చూసి ఆ తల్లిదండ్రులు బ్రహ్మానందం చెందారు. వాడికి శివన్న అని పేరు పెట్టుకుని, పువ్వుల్లో పెట్టి అమిత గారాబంగా వాణ్ణి పెంచారు. ఆ బిడ్డకు ఎంత చిన్న కష్టం వచ్చినా వాళ్ళ ప్రాణాలు విలవిలా కొట్టుకునేవి.

శివన్న అలా గారాబంగా పెరిగి యుక్త వయస్కుడు కాగానే, రామయ్య వాడికొక మంచి పిల్లను తెచ్చి పెళ్ళి చేశాడు. కోడలు రావటంతో వాళ్ళకు ఆడపిల్ల లేని కొరత కూడా తీరినట్టయింది. త్వరలోనే శివన్నకు ఒక పిల్లవాడు కూడా పుట్టాడు. ఇక ముసలి దంపతుల ఆనందానికి హద్దేలేదు.

శివన్న బిడ్డ తండ్రి అయినాక కూడా రామయ్య తన కొడుకును ఏ మాత్రమూ కష్ట పడనిచ్చేవాడు కాడు. శ్రమతో కూడిన పని అంతా తానే చేస్తూ, కొడుకును అలాటి పని చెయ్య నిచ్చేవాడు కాడు. అందుచేత, తన ముసలి తండ్రి ఇంటిల్లిపాది కోసమూ శ్రమిస్తూ ఉంటే శివన్న సహాయపడటానికైనా అవకాశం ఉండేది కాదు. ఇది శివన్నకు బాధగానే ఉండేది, కాని తండ్రి తనను పని చెయ్యనివ్వక పోవటం చేత శివన్న ఏమీ చేయలేక పోయాడు.

"రత్న"

తొలకరి పచ్చింది. పొలం దున్నటానికి రామయ్య నాగలికి ఎడ్లను కట్టి బయలు దేరాడు. తొలకరించిందన్నమాటే గాని ఎండ తీవ్రంగా ఉన్నది. ఆ ఎండలో తన ముసలి తండ్రి చెమటోడ్చుతూ పొలం దున్నటం చూసి శివన్న చాలా బాధపడి, తండ్రి వద్దకు వెళ్ళి, "అమ్మ నిన్ను అన్నానికి రమ్మం టున్నది, వెళ్ళు. ఈలోపల నేను దున్ను తుంటాను," అన్నాడు.

రామయ్య ఇంటికి వెళ్ళి, నూతి దగ్గిర నీళ్ళు పోసుకుని, గోపమ్మ పెట్టిన అన్నం తిని, సడపలోకి వచ్చాడు. ఎర్రని ఎండలో తన కొడుకు నాగలిపట్టి పొలం దున్నటం రామయ్య కంటపడింది. అతని ప్రాణాలు కొట్టుకుపోయాయి. వెంటనే అతను పంచె ఎగగట్టి గబగబా కొడుకు దగ్గిరికి వెళ్ళి, "ఎండ చూడరా, ఎలా మండి పోతోందో. నువు ముందు లోపలికి వెళ్ళు," అని నాగలి పట్టుకోబోయాడు.

శివన్న తండ్రి మాటలకు నవ్వుకున్నాడు, కాని నాగలి వదలక ఉత్సాహంగా చాలు దున్నుతున్నాడు. రామయ్య కొడుకును బతి మాలాడు. లాభం లేకపోయింది. రామయ్య కాస్సేపు ఆలోచించి, ఇంటి కేసి వెళ్ళి, ఏడాది వయసుగల తన మనవణ్ణి ఎత్తుకుని తిరిగి వచ్చి, శివన్న దున్నే పొలంగట్టు మీద ఎండలో కూర్చోబెట్టాడు.

శివన్న తన కొడుకుని చూసి చప్పున నాగలి వదిలి, పరిగెత్తుకుంటూ వచ్చి, తన కొడుకును ఎత్తుకుని, తన తలకు చుట్టిన బట్ట తీసి, పసివాడి తలకు ఎండ తగల కుండా కప్పుతూ, "ఏం పని, నాన్నా? పసి వెధవను తెచ్చి ఈ మాడే ఎండలో కూర్చో బెట్టావూ?" అన్నాడు.

రామయ్య నవ్వి, "నాయనా, నీకు నీ కొడుకెంతో, నాకు నా కొడుకు అంత గాదుట్రా? కన్నప్రేమ ఎట్లా ఉంటుందో ఇప్పుడైనా తెలిసింది గద!" అన్నాడు.





# ఫలించిన దురాశ

ఒక ఊళ్ళో మునిస్వామి అనే భూస్వామి వుండేవాడు. అతను ఏలోటూ లేకుండా తన భార్యతోనూ, ఇద్దరు కొడుకులతోనూ సుఖంగా జీవిస్తూ ఉండేవాడు. ఒకనా డొక సాముద్రిక శాస్త్రజ్ఞుడు ఆ ఊరు వచ్చి, ఊళ్లో అనేకమంది చేతులు చూసి, వారి వారి భవిష్యత్తు చెప్పాడు. ఆయన మునిస్వామి చెయ్యికూడా చూసి, "నీకు స్థలం మారితేతప్ప యోగం పట్టదు. ఇప్పుడు నీకున్న దంతా చిల్లిగవ్వ లేకుండా పోవాలి. తరవాత ఒక ఏడాదిపాటు పేదరికం అనుభవించాలి. ఆ మీదట రాజయోగం పట్టుతుంది. ఘనమైన కీర్తిప్రతిష్ఠలు కూడా కలుగుతాయి," అని జోస్యం చెప్పాడు.

రాజయోగం పట్టించుకుని, కీర్తిప్రతిష్ఠలు సంపాదించాలన్న దురాశ మునిస్వామిలో కలిగింది. ఆయన తనకున్న దంతా ఆ జ్యోస్యుడికే ఇచ్చేసి, కట్టుబట్టలతో తన భార్యనూ, ఇద్దరు కొడుకులనూ వెంటబెట్టుకుని, ఉన్న ఊరు విడిచి దేశసంచారం బయలుదేరాడు.

రెండురోజుల అనంతరం మునిస్వామి కుటుంబం ఒక గ్రామం చేరింది. మునిస్వామి ఆ ఊళ్లో ఉండే పూటకూళ్ళ పెద్దమ్మ ఇంటికి వెళ్ళి, "పెద్దమ్మా, నేనూ మావాళ్ళూ దిక్కులేని పక్షులం. మాకు ఉండటానికి కాస్త పంచా, తినటాని కింత తిండీ చూపిస్తివా, నువు చెప్పిన పనులన్నీ చేస్తూ ఇక్కడే ఉండిపోతాం," అన్నాడు.

పెద్దమ్మ సరేనన్నది. మునిస్వామి రోజూ అడవికి వెళ్లి కట్టెలు కొట్టి తెచ్చేటట్టూ, మునిస్వామి భార్య వంటా వార్పూ చూసేటట్టూ, మునిస్వామి కొడుకులు చిల్లర పనులు చేసిపెట్టేటట్టూ, ఏర్పాటయింది.

ఒకనాడు పెద్దమ్మ ఇంటికి ఒక వ్యాపారి వచ్చాడు. అతను భోజనం చేస్తూ ముని

ఎల్. కుమారస్వామి



స్వామి భార్య అయిన చంపావతిని చూసి, ఆమె పైన ఆశపడ్డాడు. అతను పెద్దమ్మతో రహస్యంగా తన కోరిక చెప్పాడు. పెద్దమ్మ దవడలు నొక్కుకుని, "అవ్వ! ఆ మనిషికి మొగుడున్నాడు. పిల్లలున్నారు. పరస్త్రీని కోరటం మహాపాతకం," అన్నది.

వ్యాపారి పేదరాసి పెద్దమ్మ చేతిలో చిన్న రూపాయల మూటపెడుతూ, "నువ్వేమీ చెయ్యనవసరంలేదు. ఈ చంపావతిని ఏదో మిషమీద రేవులో ఉన్న నా పడవ వద్దకు పంపు. నా పడవలో మీ ఇంటికి కావలిసిన పాత్ర సామగ్రీ, జాడీలూ, రాచిప్పలూ మొదలైనవి ఎన్నో ఉన్నాయి," అన్నాడు.



పెద్దమ్మ డబ్బుకు అమ్ముడుపోయి, ఆ సాయంకాలం చంపావతితో, "ఇవాళ వచ్చిన పడవలో వంటింటి సామాన్లు చాలా ఉన్నాయిట, వెళ్ళి చూసివద్దామా? మనకు పెద్ద జాడీ ఒకటి ఎలాగూ కావాలి," అన్నది.

ఆ సాయంకాలం సూర్యాస్తమయంవేళ పూటకూళ్ళ పెద్దమ్మా, చంపావతీ నదికి వెళ్ళారు. నది ఒడ్డుమీది నుంచి పడవలోకి వెళ్ళటానికి ఒక కొయ్యపలక వేసి వున్నది. దాన్ని చూసి పెద్దమ్మ, "ఓ యమ్మో. ఈ పలక మీద కాలుపెట్టానంటే కళ్ళుతిరిగి నదిలో పడతాను. నువ్వు లోపలికి వెళ్ళి మనకు పనికివచ్చేవి ఏమేం సామాన్లున్నాయో చూసిరా. కావలిసినవి కొందాం," అంటూ నది ఒడ్డునే ఇసకలో చతికిల బడిపోయింది.

వ్యాపారి తన కళాసులతో ముందే చెప్పి ఉంచటంచేత, చంపావతి పడవలోకి ఎక్కిన మరుక్షణమే వాళ్ళు కట్టుతాడు విప్పి, పడవను నదీప్రవాహంలోకి తోశారు. ఆ సంగతి గ్రహించక చంపావతి వ్యాపారిని చూసి గుర్తించి, "మీ వద్ద ఉన్న పాత్రసామాను చూపిస్తారా?" అన్నది.

"చూడటం దేనికి? ఈ పడవంతా నీదే! నేనే నీవాణ్ణి. మన వూరు వెళ్ళాక నిన్ను



అందలా లెక్కిస్తాను. ఇక నుంచీ నీ కష్టాలు గట్టెక్కాయనుకో!" అన్నాడు వ్యాపారి.

పడవ నదీప్రవాహం వెంట పోతున్న సంగతి చంపావతికి అప్పు డర్థమయింది. "అయ్యో నా మొగుడు! నా పిల్లలు!" అంటూ ఆమె పడవలో నుంచి నీటిలోకి దూకేసింది. ఆమెను ఆపబోయి వ్యాపారి కూడా నీటిలో పడ్డాడు.

కళాసులు కొందరు నీటిలోకి దూకి చంపావతిని మాత్రం ప్రాణాలతో పడవలోకి చేర్చగలిగారు. వ్యాపారి వాళ్ళకు దొరికే సరికి అతని ప్రాణాలు పోనే పోయాయి. కళాసులు వ్యాపారి శవాన్నీ, చంపావతినీ కూడా వ్యాపారి ఉండే నగరం చేర్చారు. వ్యాపారి తలపెట్టిన ద్రోహం వాళ్ళకు తెలుసు గనుక ఆ సంగతి అంతా వాళ్ళు వ్యాపారి కొడుకుతో చెప్పారు.

చంపావతిని వదిలేస్తే తన తండ్రి తల పెట్టిన దుర్మార్గం లోకానికి వెల్లడి అవుతుంది. అందుచేత వ్యాపారి కొడుకు చంపావతితో, "ఈ నగరపు కొత్వాలు మా నాన్నకు మంచి స్నేహితుడు. మా నాన్న చావుకు నువే కారణమని నేను ఫిర్యాదు చేశానంటే ఆయన నిన్ను తప్పక కొరత వేయిస్తాడు. ఎందుకొచ్చినట్టు? నువు మా ఇంట చాకిరీ



చేస్తూ ఉండిపోయినట్టయితే మా నాన్న ప్రమాదవశాన నీటిలో పడి మరణించాడని లోకానికి తెలియబరుస్తాను. ఇది నీకు సమ్మతమేనా?" అన్నాడు.

అతని మాటకు చంపావతి ఏమీ బెదర లేదు. తాను తన తండ్రి గుట్టు బయట పెట్టేస్తుందని ఆ అబ్బాయే దడుచుకు చస్తున్నాడని ఆమె గ్రహించింది. చచ్చినవాడి మీద కక్ష సాధించాలన్న ఉద్దేశం చంపావతికి లేదు. కాలం కలిసివచ్చేదాకా ఎక్కడైనా చాకిరీ చేసుకు బతకవలిసిందే గాని, తనకు మార్గాంతరం లేదని గ్రహించి ఆమె ఆ కుర్రవాడు చెప్పినదానికి సరేనన్నది.



అక్కడ మునిస్వామి చీకటి పడే వేళ అడవి నుంచి కట్టెల మోపుతో తిరిగి వచ్చే సరికి, అతని కొడుకులిద్దరూ కుళ్ళి కుళ్ళి ఏడుస్తూ, "అమ్మ ఎటో పోయింది," అని తండ్రితో చెప్పుకున్నారు. అతను పెద్దమ్మను అడిగితే, పెద్దమ్మ ఇంతెత్తున ఎగిరిపడి, "ఎక్కడ చచ్చిందో నాకేం తెలుసు? చెప్పిందా, చేసిందా? చచ్చినట్టు వంట చేసుకుంటున్నాను. నలుగురు నా మీద పడి తింటున్నారు! కృతజ్ఞత అయినా లేదు. నువ్వూ, నీ పిల్లలూ నా కేమీ చెయ్యక్కర్లేదు. మీ దారిన మీరు పదండి. అదే ఉద్ధరింపు అనుకుంటాను," అని ఛడామడా వాగింది.

ఆ రాత్రి అక్కడే గడిపి మర్నాడు తెల్లవారు జామునే తన ఇద్దరు కొడుకులనూ వెంట బెట్టుకుని రహదారి పట్టి బయలు దేరాడు మునిస్వామి. సాయంకాలం అయే సరికి వాళ్ళొక నదిని చేరుకున్నారు. మునిస్వామి నది దాట దలిచాడు. కాని అక్కడ ఒక బల్లకట్టుగాని, పడవగాని లేదు. అదీ గాక మునిస్వామి దగ్గిర కేవు డబ్బులు కూడా లేవు. అతను ఈదగలడు గాని ఇద్దరు పిల్లలనూ మీద ఎక్కించుకుని ఈదటం సాధ్యంకాదు.

అందుచేత మునిస్వామి ఒక కొడుకును అక్కడే కూర్చుని ఉండమని, రెండోవాణ్ణి మెడల మీద ఎక్కించుకుని అవతలి వొడ్డుకు ఈది, వాణ్ణి అక్కడ దించి, రెండో వాడి కోసం వెనక్కు ఈదుకుంటూ వస్తూండగా ప్రవాహంలో పెద్ద సుడి ఏర్పడి మునిస్వామిని అడుగుకు లాగేసింది. అతనికి స్పృహ తప్పిపోయింది.

మునిస్వామికి తిరిగి స్పృహ తెలిసేసరికి అతని చుట్టూ చాలామంది గుమిగూడి ఉన్నారు. వారంతా అతనికి ఏవేవో సపర్యలు చేస్తున్నారు. అతనికి స్పృహ వచ్చి, కాస్త స్వస్థత చేకూరగానే తనకు రాజయోగం పట్టినట్టు అతనికి తెలిసిపోయింది.



జరిగిన దేమంటే, కొద్ది రోజుల క్రితం ఆ నదీ తీరాన ఉన్న నగరపు రాజు వారసులు లేకుండా ఆకస్మికంగా చనిపోయాడు. ఆయన పోయిన నాటి రాత్రే మంత్రికి కలలో నగర దేవత కనిపించి, "మీ కాబోయే రాజు నది వెంట కొట్టుకు వస్తాడు. అతని కోసం ఎదురుచూడు!" అని హెచ్చరించింది. మంత్రి ఈ సంగతి రాజభవనంలోని వారందరికీ చెప్పి, నదీ తీరాన అహోరాత్రాలు మనుషులను కాపు పెట్టాడు. వాళ్ళే మునిస్వామిని ఒళ్ళు తెలియని స్థితిలో నది నుంచి బయటికి లాగారు. అతన్ని రాజును చేశారు.

రాజయోగం పట్టి రాజ్యాభిషేకం చేయించుకున్నాడు గాని, మునిస్వామికి భార్యాబిడ్డలను గురించి ఆందోళన మిగిలిపోయింది.

అతను ఏటిలో కొట్టుకు పోవటం నది రెండు తీరాలా కూర్చున్న అతని కొడుకులిద్దరూ చూసి పెద్దగా ఏడవసాగారు. ఒక చాకలివాడు వాళ్ళిద్దరినీ రక్షించి తెచ్చి, తన ఇంట ఉంచుకుని, పెంచి పెద్ద చేశాడు. ఆ చాకలికి సంతానం లేదు. ఆ కొరత ఈ పిల్లల ద్వారా తీరింది.

వాళ్ళపేర్లు రామన్నా, భీమన్నా. రామన్నా భీమన్నలు ఒక వ్యాపారి ఇంట కావలికి కుదిరారు. ఆ తరవాత కొద్ది రోజులకే వ్యాపారి ఇంట ఒక దొంగ ప్రవేశించాడు. వాణ్ణి ఈ కుర్రాళ్ళు పట్టుకుని కొత్వాలుకు అప్పగించి, కొత్వాలు నుంచి బహుమానం కూడా పొందారు. అది చూసి వ్యాపారి దురాశాపరుడై, "మిమ్మల్ని నేను జీతమిచ్చి పెట్టుకున్నది దొంగలను పట్టుకోవటానికే. మీరా దొంగను నా ఇంటనే పట్టుకున్నారు. అందుచేత ఆ బహుమానం నాకే రావాలి," అన్నాడు రామన్న భీమన్నలతో.

అందుకు రామన్న భీమన్నలు ఒప్పుకోలేదు. వాళ్ళు తమకు దొరికిన బహుమానాన్ని చాకలి దంపతులకు ఇచ్చేశారు.

వ్యాపారి వాళ్ళనేమీ చెయ్యలేకపోయాడు గాని లోపల వాళ్ళ మీద చాలా కోపంగా ఉండి అవకాశం కోసం చూస్తున్నాడు.

ఈ వ్యాపారి ఇంటనే చంపావతి ఎన్నో ఏళ్ళుగా చాకిరీ చేస్తున్నది. దొంగను పట్టుకున్న కుర్రాళ్ళను గురించి విని ఆమె, తన కొడుకులు ఈ పాటికి ఆ యీడు వాళ్ళే అయి ఉంటారు గదా అనుకున్నది. ఆమెకు వాళ్ళను చూడాలనిపించింది. పని తీరిక చూసుకుని ఆమె వారున్న చోటికి వచ్చి, "మీరేగదా యిక్కడ కాపలా వాళ్ళు? మీ పేర్లేమిటి?" అని అడిగితే వాళ్లు, "రామన్నా, భీమన్నా," అని చెప్పారు.

చంపావతికి పట్టరాని ఉద్రేకం వచ్చి, "నా కిద్దరు కొడుకులుండేవాళ్లు. వాళ్ల పేర్లు కూడా మీవే. మీ తల్లిదండ్రు లెవరు, నాయనా?" అని అడిగింది.

వాళ్ళు తమ చిన్ననాటి జ్ఞాపకాలు స్మరించుకుని ఒక్కొక్కటే చెప్పసాగారు.

ఇది వ్యాపారికి మంచి అవకాశం అయింది. అతడు తన వస్తువులను కొన్నిటిని తెచ్చి, ఆ తల్లీ కొడుకులు మాట్లాడేచోట పడేసి, "మీరు మా పనిమనిషితో ఏమిటి గూడుపుఠాణీ చేస్తున్నారు? ఈ వస్తువులు దొంగతనం చేస్తున్నారా? ఉండండి, మీపని చెబుతాను," అంటూ ఒక సేవకుణ్ణి పిలిచి, కొత్వాలును పిలిపించి, తన కాపలావాళ్లు తన ఇంటి పనిమనిషితో రహస్యంగా ఆలోచన చేసి తన వస్తువులు కాజెయ్య యత్నించారనీ, పట్టుకున్నాననీ ఫిర్యాదు చేశాడు.

కొత్వాలు ఈ ఫిర్యాదును నమ్మక ఆ తల్లీ కొడుకుల విచారణ రాజుగారే జరపాలని నిర్ణయించాడు. ఆ విధంగా మునిస్వామి తన భార్యనూ, బిడ్డలనూ తిరిగీ కలుసుకున్నాడు. ఆయన తన కొడుకులను పెంచి పెద్దచేసిన చాకలికి మంచి ఈనా మిచ్చి ఆదరించాడు. ఆ తరవాత మునిస్వామి కుటుంబం రాజవైభోగంలో సుఖంగా జీవించారు.





# అచ్చి వచ్చిన ఆకులు

ఒక దూరదేశంలోని జాగీరులో ఇద్దరు అన్న దమ్ము లుండేవాళ్ళు. వాళ్ళు చాలా బీద వాళ్ళు. వాళ్ళ కొక పాతగుడిసే, కూరలు పెంచటానికి వీలయిన చిన్న పెరడూ, ధాన్యం పండించటానికి కొద్దిపాటి పొలమూ ఉండేవి. వాళ్ళు పెద్దవాళ్ళయికూడా వేర్లు పడి చెరొకదారీ వెళ్ళిపోక, ఆ పాతగుడిసె లోనే వుండి చెప్పులు కుట్టుకుంటూ, మరమ్మతు చేస్తూ ఏదోవిధంగా పొట్టపోసు కుంటూ వచ్చారు.

కాని ఇట్లాకూడా వాళ్ళకు ఎంతో కాలం సాగలేదు. పట్నం నుంచి మరొక చెప్పులు కుట్టేవాడు వచ్చి వాళ్ళుండే ఊళ్ళోనే మంచి ఇల్లు ఏర్పాటు చేసుకుని ఈ అన్న దమ్ములకు పోటీగా వ్యాపారం మొదలు పెట్టాడు. అందరూ వాడి దగ్గిరే తమ చెప్పులు బాగు చేయించుకుని, వాడి పని తనాన్ని మెచ్చుకుని, అన్నదమ్ముల ముఖం చూడటం మానేశారు. కష్టాలన్నీ కలిసి వస్తా యన్నట్టుగా ఆ ఏడే వాళ్ళ పొలం సరిగా పండలేదు. అసలే దారిద్ర్యంతో బాధపడే ఆ అన్నదమ్ములు, యీ కారణంగా కటిక దరిద్రం వాతపడ్డారు.

శీతాకాలం వచ్చింది. ఒక రాత్రి చలి మరీ తీవ్రంగా ఉన్నది. అందరూ భోగి మంట వేసుకుంటున్నారు.

"మనకు కట్టెలున్నా బాగుండును, భోగి మంట వేసుకుందుము," అన్నాడు అన్న.

"మన ఇంటి ముందున్న మైదానంలో ఒకప్పుడు అడవి ఉండేది. దాన్ని జాగీరు దారు కొట్టేయించాడు. ఇప్పుడుకూడా లావు పాటి చెట్లవేళ్ళు పైకి కనిపిస్తూనే ఉంటాయి. మనింటికి దగ్గిరలోనే మూరెడు మందం గల వేరు సగం బయటికి వచ్చింది. దాన్ని తవ్వి తెచ్చి మనం భోగిమంట వేసుకుందాం," అన్నాడు తమ్ముడు.

ఆర్. రామబ్రహ్మం



ఇద్దరూ దీపం తీసుకుని మైదానం మీదికి వెళ్ళి, తమ్ముడు చెప్పిన దుంగలాటి వేరును తవ్వి తెచ్చి, దానికి ఒక చివర నిప్పు అంటించారు. ఎన్నేళ్ళుగానో ఎండిపోయిన ఆ దుంగ చక్కగా నిలిచి కాలసాగింది.

అంతలోనే వాళ్ళకు ఆ దుంగలో నుంచి కోయిల ఒకటి "కుహూ, కుహూ!" అని కూయటం వినపడి అమిత ఆశ్చర్యం కలిగింది. వాళ్ళు చూస్తూండగానే ఆ దుంగలో ఉన్న తొర్ర నుంచి ఒక కోయిల బయటికి వచ్చింది. ఇది చూసే వాళ్ళు ఆశ్చర్యపోతూ ఉంటే, ఆ కోయిల వాళ్ళతో, "బాబుల్లారా, ఇదే రుతువు?" అన్నది.

"రుతువా? కార్తీకమాసం," అన్నారు అన్నదమ్ములు.

"ఈ తొర్రలో హాయిగా నిద్రపోతూ, ఈ వేడికి కాబోలు వసంత కాలం వచ్చేసిందనుకుని మేలుకున్నాను. సంక్రాంతి వెళ్ళినదాకా నన్ను ఏ కంతలోనో పడుకోనిస్తిరా, మీ రుణం ఉంచుకోను," అన్నది కోయిల.

"నీ నిద్ర మా మూలంగానే గడ పాడయింది? నీ యిష్టంవచ్చినన్నాళ్ళు మాఇంట ఉండు," అన్నారు అన్నదమ్ములు.

చూరులో వాళ్ళు దాని కొక గూడు తయారుచేశారు. అది నెలల తరబడి అందులో పడుకుని నిద్రపోయి తిరిగి సంవత్సరాదికి లేచి, "కుహూ, కుహూ!" అని అరిచింది. అది అన్నదమ్ములతో, "ఇక నేను ప్రపంచమంతా సంచారం చేసి, వసంత కాలం వచ్చిందని చాటించి రావాలి. తిరిగి వచ్చేటప్పుడు మీకు ఏమి బహూమానం తెమ్మన్నారు?" అన్నది.

"అన్ని కష్టాలకూ మూలం పేదరికం. మా పేదరికం తీరేటట్టు ఎక్కడన్నా ఒక మంచి ముత్యంగాని, రత్నంగాని దొరికితే తెచ్చిపెడుదూ! ప్రపంచమంతా సంచారం చేసే నీకు ఆ మాత్రం తెలీకుండా ఉంటుందా?" అన్నాడు అన్న.

"ముత్యాలూ, రత్నాలూ ఉండే చోటికి నేను పోను. అందుచేత వాటి గొడవ నాకు నిజంగా తెలీదు. నేను తిరిగే అడవులూ, అరణ్యాలూ లాటి వాటిలో రెండు విడ్డూరమైన చెట్లున్నాయి. ఒకదాని ఆకులు పండి రాలుతూనే బంగారపు ఆకులుగా మారిపోతాయి. పండి రాలినాక అవి ఎత్తుకెత్తు మేలిమి బంగారమే. దానికి దగ్గరలోనే మరొక చెట్టున్నది. దాని ఆకులు ఎప్పుడూ ఆకుపచ్చగానే ఉంటాయి. కోసినా కూడా అవి వాడవు, ఎండవు, రంగు మారవు. ఆ ఆకు దగ్గిర ఉంచుకున్న వాడికి ఎలాటి చీకూ, చింతా ఉండదు. ఈ ఆకుల్లో ఏది కావాలన్నా నేను తీసుకురాగలను," అన్నది కోయిల.

"అయితే నాకు బంగారు ఆకు తే!" అన్నాడు అన్న ఆత్రంగా.

"నాకు వాడని ఆకు తే," అన్నాడు తమ్ముడు. మరుక్షణమే కోయిల తుర్రుమని పారి పోయింది. దూరాన దాని "కుహూ, కుహూ!" ధ్వని వినిపించింది.

తిరిగి వర్షాలు ఆరంభమయే సమయానికి కోయిల తిరిగి వచ్చింది. దాని ముక్కులో రెండు ఆకులున్నాయి. ఒకటి బంగారుఆకు, రెండోది మామూలు ఆకు.



బంగారు ఆకును అన్నా, మామూలు ఆకు తమ్ముడూ తీసుకున్నారు.

"మళ్ళీ వచ్చే ఏడు ఇదే సమయానికి ఇలాగే ఆకులు తెచ్చి ఇస్తాను," అని చెప్పి కోయిల వెళ్ళిపోయింది.

బంగారు ఆకు చేతికి వచ్చాక అన్నకు తమ్ముడి పైన చాలా రోత పుట్టింది. "వీడింకేం బాగుపడతాడు? వీణ్ణి శని పట్టాడు. అందుకే వెధవఆకు తెప్పించుకున్నాడు. వీడి శనే నాకూ ఇంత కాలమూ అంటింది," అనుకుని అన్న తమ్ముడి నుంచి వేరుపడి తన చెప్పుల పని తాను చేసుకోసాగాడు. అన్న దగ్గిర బంగారం చేరిందని



తెలియగానే, అంత కాలమూ అతన్ని పెళ్ళాడటానికి ఒప్పుకోని మనిషి తనంతట తానే పెళ్ళాడతానని వచ్చింది. పట్టుపు చెప్పులు కుట్టేవాడు అన్నను తన పనిలో భాగస్వామిగా తీసుకున్నాడు.

అన్న ఈ విధంగా బాగుపడితే తమ్ముడి పరిస్థితి మరింత అధ్వాన్న మయింది. అత నికి ఇల్లూ పెరడూ మాత్రమే మిగిలింది. అతను చెప్పులుకుట్టే పని మాని, పెరట్లో కూరలు పండిస్తూ, మైదానం మధ్యగా ప్రవహించే వాగు గట్ల వెంబడి దొరికే రక రకాల దుంపలూ, కాయలూ, ఆకులూ ఏరి తెసూ ఏదో విధంగా పొట్టపోసుకునేవాడు. అందరూ తనను చాలా హీనంగా చూస్తున్నా రని గాని, తాను ఎన్నడూ ఎరగనంత దారిద్ర్యం అనుభవిస్తున్నానని గాని, తన అన్న కూడా తనకు దూరమయాడని గాని అతనెన్నడూ బాధపడి ఎరగడు. మీదు మిక్కిలి అతను తనకు జీవితంలో ఎలాటి లోటూ లేనట్టు కనబడేవాడు.

ఇది ఇట్లావుండగా, ఆ వూరి జాగీరుదారు రాజసభలో తన ఉద్యోగం పోగొట్టుకుని, మైదానం అవతలి చివరనున్న తన భవనా నికి తిరిగి వచ్చాడు. ఉద్యోగం పోవటం ఒకటే కాదు, జాగీర్దారుకు శత్రువులు చాలా అవమానం కూడా కలిగించి, రాజధానిలో తలఎత్తుకు తిరగటానికి లేకుండా చేశారు. అందుచేత ఆయన తన జాగీరుకు తిరిగి వచ్చి, అహోరాత్రాలు అవమానంతో కుమిలిపోసాగాడు.

ఒకనాడు జాగీరుదారు మైదానం మీద ఒంటరిగా పచారు చేస్తూండగా, వాగు సమీ పంలో అతనికి తమ్ముడు కనబడ్డాడు. ఇద్దరూ కాస్సేపు మాట్లాడుకున్నారు. అంత లోనే జాగీరుదారు మనస్సులో ఉన్న భార మంతా దిగిపోయినట్టయింది. ఆయన ఇంటికి తిరిగి వెళ్ళేసరికి ఆయన నౌకర్లూ, భృత్యులూ ఆయనను గుర్తించలేక

పోయారు. ఆయన చాలా ఉత్సాహంలో ఉన్నాడు. నౌకర్లందరినీ పలకరించి సరదాగా కబుర్లు చెప్పాడు. వేటకు ప్రయత్నాలు చేశాడు. తన జాగీరులో ఉండే వాళ్ళందరికీ అప్పుడప్పుడూ విందులూ, వినోదాలూ ఏర్పాటు చేశాడు.

జాగీరుదారులో కలిగిన మార్పుకు కారణం తమ్ముడితో ఆయన మాట్లాడటమే నన్నది ఊరంతా పాక్కిపోయింది. అతని గుడిసెకు ధనికులూ, దరిద్రులూ కూడా వచ్చి, అతనితో మాట్లాడి తమ విచారాలన్నిటినీ పోగొట్టుకుని, తమ శక్తికొద్దీ అతనికి కానుక లిచ్చి వెళ్ళిపోసాగారు.

తమ్ముడి ఖ్యాతి రాజధానికి కూడా పాకింది. రాజుగారు అతన్ని తీసుకురమ్మని దూతలను పంపాడు. వాళ్ళు రాజుగారి వద్ద నుంచి వెలలేని బట్టలూ, ఆభరణాలూ కానుకగా తెచ్చి ఇచ్చి, తమ్ముణ్ణి రాజధానికి ఆహ్వానించారు.

అప్పటికి కోయిల అతనికి నాలుగు ఆకులు తెచ్చి ఇచ్చింది. తమ్ముడు వాటిని తన గొంగళి మధ్య ఉంచి, ఆ గొంగళిని రెండుగా మడిచి కుట్టి, దాన్ని భుజాన వేసుకుని రాజుగారి అతిథిగా వెళ్ళాడు.

రాజుగారు తమ్ముణ్ణి పిలవటానికి కారణం ఉన్నది. రాజ్యమైతే సుభిక్షంగానే ఉన్నది






గాని, ప్రజలలో ధనాశ పెరిగిపోయింది; పెద్దవాళ్ళలో కూడా వంచనా, మోసాలూ బలిసిపోయాయి. రాజుగారికి రోజూ అనేక వందల ఫిర్యాదులు వస్తున్నాయి. ఫిర్యాదులు చేసేదీ గొప్పవాళ్ళే, గొప్పవాళ్ళ మీదనే. రాజుగారు తన కొలువులో ఉన్న వారిలో ఒక్కణ్ణి కూడా నమ్మలేకుండా ఉన్నాడు. రాజుగారి కుటుంబంలో కూడా శాంతిలేదు. దివాణపు నౌకర్లందరూ దొంగలే. వాళ్ళ వెనక రాజకుటుంబంలోని వారు ఎవరో ఒకరు ఉండటమూ, ఆ నౌకర్లను వెనకవేసుకొచ్చి తమలో తాము కీచులాడు కోవటమూ నిత్యకృత్యమైపోయింది.

ఇలాటి దుర్భర పరిస్థితిలో రాజు తమ్ముణ్ణి పిలిపించాడు. అతను రాజభవ సంలో అడుగు పెట్టిన క్షణంనుంచీ అందరి మధ్యా తగాదాలు నిలిచిపోయాయి. స్నేహ భావం పెరిగింది. రాజోద్యోగులు పరస్పరం ఆరోపణలు చెయ్యటం మానేసి ఒకరి నొకరు గౌరవించుకోసాగారు. రాజుగారు తమ్ముణ్ణి గురించి పుకారుగా విన్నది అక్షరాలా నిజమయింది. అందుచేత రాజు అతన్ని తన భవనంలోనే ఉండనిచ్చి అతనితో రోజూ గోష్ఠి జరుపుతూవచ్చాడు. ఈ గోష్ఠిలో మంత్రి సామంతుల దగ్గరనుంచీ పాల్గొనేవాళ్ళు. అతను ఎవడన్న ప్రశ్న ఎవరికీ కలగలేదు; అందరూ అతనితో మాట్లాడాలని ఉత్సాహపడేవాళ్ళు.

ఇప్పుడు తమ్ముడిలో చెప్పులు కుట్టేవాడి లక్షణాలేవీ లేవు. అతని వాలకమంతా ఉన్నత రాజోద్యోగికి తగినట్టే ఉండేది. కాని ఎంద రెంత చెప్పినా అతను తన భుజం మీది పాత కంబళీ మాత్రం విసర్జించలేదు. "ఇది నా అసలు స్వరూపాన్ని నాకు గుర్తు చేస్తూ ఉంటుంది. రాజభవనంలో ఉన్నాం గదా అని మనం మన అసలు స్వరూపాన్ని మరిచిపోరాదు," అనేవాడు తమ్ముడు. ఈ మాటతో అందరూ తృప్తిపడేవారు.



తమ్ముడు కోటలో పాగావేశాడన్న సంగతి విని అన్నకు పట్టరాని ఈర్ష్య కలిగింది. "మూడు నాలుగు పిచ్చి ఆకులతో వాడికి అంత అదృష్టంపడితే బంగారు ఆకులు సంపాదించుకున్న నా గతి ఇలా ఉండట మేమిటి? నేను కూడా రాజధానికిపోయి, వాడికన్న వెయ్యిరెట్లు రాజాదరణ పొందు తాను," అని అతను భార్యతో చెప్పి, ఆమెతో కూడా రాజధానికి బయలుదేరాడు.

వాళ్ళు రెండు మూడు రోజులు కాలి నడకన ప్రయాణం చేసి, ఒకనాటి మధ్యాన్నం రాజధానికి కొద్ది దూరంలో ఉన్న అరణ్యంలో భోజనం చెయ్యటానికి ఆగారు. అప్పటికి వాళ్ళు తెచ్చుకున్న ఆహారం దాదాపు అయిపోయి, అడుగూ బొడుగూ మిగిలింది. అదే తిని ఆకలి బాధ తీర్చుకునే ప్రయత్నంలో వాళ్ళు ఉండగా అక్కడి కొక ఆడది, నెత్తిన ఒక గంప పెట్టుకుని వచ్చి, "ఇక్కడ బావి ఉన్న ట్టున్నదే! నేను కూడా నీటి కోసమే చూస్తు న్నాను," అంటూ తన నెత్తి మీది గంప దింపింది.

ఆ గంప నుంచి కమ్మని, వేడివేడి వంట కాల వాసన వస్తున్నది. అన్నా, అతని భార్యా ఆ గంప కేసి చూస్తూ గుటకలు వేశారు.




"మీరు చూడబోతే మహారాజుల్లా గున్నారు. నా వంట తింటారా, నాయనా? తినేట్టయితే కావలసినంత ఉన్నది," అన్నదా గంప మనిషి.

"నువ్వు ఆప్యాయంగా ఇస్తానంటే తీసు కోవటానికి మాకభ్యంతరంలేదు. ఇచ్చేవాళ్ళ కులం కన్న మంచి మనస్సు ముఖ్యం," అన్నాడు అన్న బెట్టుగా.

ఆ ఆడమనిషి మంచి మంచి భక్ష్యాలు వాళ్ళిద్దరికీ పెట్టి, గంప అడుగున ఉన్న దుత్తలో నుంచి పాయసం తీసి ఇద్దరికీ తాగటానికి ఇచ్చింది. ఆ పాయసంలో మత్తు మందున్నది. దాన్ని తాగిన కొద్దిసేపట్లో



భార్యా భర్త లిద్దరూ ఒళ్ళు తెలియని నిద్రలోపడిపోయారు.

తరవాత ఆ దొంగమనిషి వారిద్దరినీ నిలువుదోపిడీ చేసేసి, కట్టుబట్టలతో మిగిల్చింది. ఇంతలో అక్కడికి ఆమె కొడుకు, పదేళ్ళ కుర్రవాడు ఒక గొంగళీ తీసుకుని వచ్చాడు. "ఊళ్ళో ఏం దొరికిందిరా?" అని తల్లి కొడుకు నడిగింది.

"ఏమీ దొరకలేదమ్మా. రాజుగారి ఇంటి పక్కగా అర్ధరాత్రి వేళ పోతూంటే మేడ కిటికీ నుంచి ఈ కంబళి పడింది. ఉత్త చేతులతో రావటం దేనికని దీన్ని తెచ్చా," అన్నాడు కొడుకు.

ఆడమనిషి గొంగళిని పరీక్షించి, "ఛీ, ఎందుకూ పనికిరాదు. వీళ్ళు మనకు చాలా ఇచ్చారు. ఇది వీళ్ళకుండనీ, పాపం," అంటూ ఆ గొంగళీని భార్యాభర్తల మీద వేసి కొడుకును వెంటబెట్టుకుని, గంపతో సహా తన దారిన తాను వెళ్ళిపోయింది.

ఈ గొంగళీ తమ్ముడిదే. అతనికి రాజుగారు తన సేవకుణ్ణి ఇచ్చాడు. వాడు రాజసం బలిసినవాడు. ఆ గొంగళీని మీద వేసుకునేవాడి వద్ద తాను నౌకరీ చేయటం వాడికి చాలా అవమాన మనిపించింది. అందుచేత ఒక అర్ధరాత్రి తమ్ముడు నిద్రపోయేటప్పుడు వాడా గొంగళీని కిటికీ కుండా వీధిలోకి గిరవాటు వేశాడు.

అడవిలో అన్నకు అర్ధరాత్రి అయేదాకా మెలకువ రాలేదు. అతను నిద్ర లేచి చలి వేస్తూండటం గమనించి, తన మీద ఉన్న పాత కంబళిని కప్పుకుని, తన భార్యను లేపాడు. తమ సొత్తంతా ఆడమనిషి కాజేసుకు పోయినట్టు వాళ్ళకు తెలిసిపోయింది.

"పోతే పోయిందిలే, పాడుసొత్తు! మనం అసలు రాజధాని కని ఎందుకు బయలుదేరాం? అర్థంలేని పని! ఈ అడవిలో చూడు ఎంత ఆనందంగా ఉందో! ఇక్కడే మనం ఒక చిన్న కుటీరం వేసుకుని ఉండి

పోదాం," అన్నాడు భార్యతో అన్న. ఈ మాటకు భార్య సమ్మతించింది.

ఇది జరిగిన మర్నాడు తెల్లవారగానే రాజు తన ఉద్యోగులందరితోనూ సభ చేసి, తమ్ముణ్ణి పిలిపించాడు. అప్పటికే తమ్ముడు తన కంబళి పోయిన సంగతి గ్రహించి, దాని కోసం వెతకమని తన నౌకరుతో అన్నాడు. అతను, ఎన్నడూ లేనిది ఈ సారి, "నన్ను వీళ్ళెందుకు రమ్మంటున్నారు? నే నేం నేరం చేసి ఉంటాను?" అని భయపడసాగాడు.

రాజుగారికి కూడా, "ఈ చెప్పులు కుట్టుకునే వాణ్ణి ఇన్నాళ్ళుగా నా ఇంట ఎందుకుంచుకున్నాను?" అన్న ఆలోచన వచ్చింది. ఆయన తన సభికులను అదే ప్రశ్న వేస్తే వాళ్ళు ఒకరిమీద ఒకరు ఆరోపణలు చెయ్యసాగారు. ఒక్క క్షణంలో సభ కొట్లాటగా మారింది. ఈ కొట్లాట మధ్య రాజుగారు తమ్ముడి కేసి చూసి, "నువ్వేమిటి వినోదం చూస్తున్నావు? పో ముందు బయటికి!" అని గద్దించాడు.

తమ్ముడు మారుమాటాడక కట్టుకున్న బట్టలతోనే బయటికి నడిచాడు. అతనికి తన గుడిసె గుర్తుకొచ్చింది. అక్కడికి పోదామని బయలుదేరాడు. అతను సాయంకాలం దాకా నడిచి అరణ్యంలో అన్న ఆ పూటనే



వేసుకున్న కుటీరాన్ని చేరాడు. అతనికి ఆకలి దహించుకుపోతున్నది. ఆ కుటీరంలో ఎవరో వంట చేస్తున్నారు. ఇంత తిండి తనకు కూడా పెడతారన్న ఆశతో లోపలికి అడుగుపెట్టి, లోపల గురకపెట్టి నిద్ర పోతున్న తన అన్ననూ, అతని పక్కనే కుప్పగా పడిఉన్న తన గొంగళినీ చూశాడు.

మరొకపక్క వంట చేస్తున్న అన్న భార్య తమ్ముణ్ణీ, అతను ధరించిన విలవైన బట్ట లనూ చూసి ఎవరో అధికారి అనుకుని, "అయన రోజల్లా ఇల్లుకట్టి అలిసి నిద్ర పోతున్నారు, లేపకండి. వంట అయిపో వచ్చింది. ఏకంగా అప్పుడే లేపవచ్చు," అని చెప్పింది.

తమ్ముడు తన కంబళీ తీసుకుని మీద వేసుకున్నాడు. వెంటనే అతన్ని వేధించే ఆలోచనలన్నీ విచ్చిపోయాయి.

వంట పూర్తి అయింది. అన్న లేచాడు. తమ్ముణ్ణి చూసి గుర్తించి, "తమ్ముడూ, రాజుగారి దగ్గిర ఉంటున్నావని విన్నానే. వేటకుగాని వచ్చావా?" అని అడిగాడు.

"లేదన్నా. మనకు రాజుగారివంటి వాళ్ళతో ఏంపని? మన పాత గుడిసెకు పోదామని బయలుదేరాను. నువు మాత్రం ఈ అడవిలో ఎందుకు? మనింటికే పోదాం పద! మన చెప్పులు కుట్టేపని మనం చూసుకుంటూ నిశ్చింతగా ఉందాం," అన్నాడు తమ్ముడు.

"అది మంచి ఆలోచనే! తెల్లవారగానే పోదాం," అన్నాడు అన్న.

ఆ రాత్రికి అందరూ భోజనం చేసి ఆ కుటీరంలోనే పడుకుని, మర్నాడు బయలుదేరి తమ పాత గుడిసెకు వెళ్ళి, అక్కడ పూర్వంలాగే చెప్పులు కుట్టుకుంటూ కలిసి బతికారు. తమ్ముడు రాజుగారి అతిథిగా చాలాకాలం ఉండి వచ్చాడని తెలిసి, ఊళ్ళోవాళ్ళు వాళ్ళను చాలా ఆదరంతో చూడసాగారు.





# అబద్ధాల అక్క

మణిపుర రాజకుమారుడు మహేంద్రుడూ, మంత్రికుమారుడు విజయుడూ కలిసి ఒక నాడు అడవికి వేటకుపోయారు. వేట తమ కంలోపడి వాళ్ళు దిక్కూ, దారీ పోగొట్టు కున్నారు. ఇద్దరూ బాగా అలసిపోయారు. దాహంతో నోళ్ళు ఎండిపోయాయి. నీటి కోసం ఆరాటపడుతూ వాళ్ళు ఒక అడవి దారిన వస్తుండగా ఒకచోట పాడుపడిన దేవాలయం కనిపించింది. లోపల నుంచి మనుషుల అలికిడి వినవచ్చింది. వాళ్ళు తలుపు తట్టేసరికి లోపలి నుంచి ఒక స్త్రీ కంఠం, "ఎవరది?" అని ప్రశ్నించింది.

"దాహంగా ఉన్నది, కాసిని మంచి నీళ్ళిస్తే మాదారిన మేం పోతాం," అన్నాడు, రాజకుమారుడు.

తలుపు తెరుచుకున్నది. మాసిన బట్టలతో ఉన్న ఇద్దరు అందమైన యువతులు లోపల కనిపించారు. వాళ్ళు మంచినీరూ, పనఫలాలూ, తేనే తెచ్చి రాజకుమారుడికీ, మంత్రికుమారుడికీ ఇచ్చారు.

"నేను ఈ దేశపు రాజకుమారుణ్ణి. నా పేరు మహేంద్రుడు. నా మిత్రుడు విజయుడు మంత్రికుమారుడు. మీరీ నిర్జనారణ్యం మధ్య ఈ పాడుపడిన గుడిలో ఉండటం ఆశ్చర్యంగా ఉన్నది," అని రాజకుమారుడు అన్నాడు.

వెంటనే పెద్దది జవాబు చెప్పింది:

"మేముకూడా రాజకుమార్తెలమే. ఒక రాక్షస స్త్రీ మా తండ్రిని భయపెట్టి, ఒక రాక్షసుడి కోసం తీసుకుపోతుంటే, మేం ఆ రాక్షసిని మోసగించి తప్పించుకుని పారిపోయి వచ్చి ఇక్కడ దాక్కున్నాం. మా తండ్రి దగ్గిరికి ఏమార్గాన పోవాలో మాకు తెలీదు. ఒకవేళ వెళ్లినా మళ్ళీ ఆ రాక్షసికి దొరికిపోతాం. మా తండ్రికి ఆ రాక్షసి అంటే తగని భయం."

వి. సూర్యనారాయణరావు



"మీరు ఏదేశపు రాజకుమార్తెలు? మీ తండ్రిగారి పేరేమిటి?" అని రాజకుమారుడు అక్కను అడిగాడు.

"అవన్నీ అడగకండి. చెప్పుకోపటం మాకూ అవమానం, మా తండ్రికి మరింత అవమానం," అన్నది అక్క.

ఆమె పేరు కుసుమావతి అనీ, చెల్లెలి పేరు కమలాక్షి అనీ రాజకుమారుడు తెలుసుకున్నాడు. అతను విజయుడితో రహస్యంగా సంప్రతించి, తనకు కుసుమావతిపైన ప్రేమ కలిగినట్టే, విజయుడికి కమలాక్షి పైన ప్రేమ కలిగిందని గ్రహించాడు. అతను ఆ అక్కచెల్లెళ్ళతో, "మే మిద్దరమూ మిమ్మల్నిద్దరినీ పెళ్ళాడటానికి సిద్ధంగా ఉన్నాం. మాతో వచ్చెయ్యటానికి మీకు సమ్మతమేనా?" అన్నాడు.

"మమ్మల్ని ఉద్ధరించటానికి దేవుడే మిమ్మల్ని పంపి ఉండాలి," అన్నది కుసుమావతి.

కమలాక్షి అక్కను అవతలికి తీసుకుపోయి, "ఎందు కిలా అబద్ధాలు చెబుతున్నావు?" అని అడిగింది.

"నువ్వూరుకో! అదృష్టం ఇలా వెతుక్కుంటూ వస్తే కాల తన్నేస్తామా ఏమిటి?" అన్నది కుసుమావతి.

"మనం వీళ్ళ వెంట వెళ్ళిపోతే అమ్మ గతి ఏమవుతుంది? మన కోసం బెంగపడి కుమిలిపోదూ?" అన్నది కమలాక్షి.

"ఎందుకు బెంగపడుతుంది? సంతోషిస్తుంది. ఆవిడకు మనం ఎంత భారంగా ఉన్నామో తెలుసా? మన కొకదారి ఏర్పడితే బాగుండునని ఎన్నోసార్లు అనుకున్నది. ఇక ఆటే వాగక, పోదాం బయలుదేరు," అన్నది అక్క.

చేసేదేమీ లేక కమలాక్షి అక్క వెంట బయలుదేరింది.

నిజానికి అక్కచెల్లెళ్ళు ఒక సామాన్య కుటుంబానికి చెందినవాళ్ళు. వాళ్ళ తండ్రి

ఒక ధనికుడికి చాలా హెచ్చుగా అప్పుపడి, అప్పు తీర్చలేకపోయాడు. "నీ కుమార్తె లిద్దరినీ నా కిచ్చి పెళ్ళి చెయ్యి," అని ఆ ధనికుడు ఆయనను వత్తిడి చెయ్య సాగాడు. ఆ దిగులుతోనే వాళ్ళ తండ్రి మంచంపట్టి చివరకు మరణించాడు. ఆ తర వాత వీళ్ళ తల్లి ఆ ధనికుడికి భయపడి, తన కుమార్తెలను వెంట బెట్టుకుని దేశాంత రాలు పట్టి వచ్చి, ఈ అడవి మధ్య పాడు పడిన గుడిలో కాపరం ఏర్పాటు చేసింది.

ఇవాళ ఈ రాజకుమారుడూ, మంత్రి కుమారుడూ వచ్చే సమయానికి ఈ పిల్లల తల్లి బిచ్చమెత్తి, బియ్యం తీసుకు రావటానికి దగ్గిరలో ఉన్న గ్రామానికి వెళ్ళి ఉన్నది. ఆమె తిరిగి వచ్చి తమ జాడ తెలుసు కోవటం అవసరమని కమలాక్షి ముందుగానే తన పయిట చెంగు నుంచి కొన్ని పీలికలు చించి, వాటిని ముక్కలు చేసి సిద్ధంగా ఉంచుకున్నది.

రాజకుమారుడు అక్కనూ, మంత్రి కుమారుడు చెల్లెల్నీ తమ వెనక గుర్రాల మీద ఎక్కించుకుని రాజధాని కేసి బయలు దేరారు. కమలాక్షి దారి పొడుగునా తన చీరె తుంపులను దారి పక్క ఉన్న పొదల మీద అక్కడక్కడా వేస్తూ వచ్చింది.



రాజకుమారుడూ మంత్రి కుమారుడూ రాజధానికి తిరిగి వచ్చారు. కాని రాజూ, మంత్రీ కొద్ది రోజుల క్రితం రాచకార్యం మీద మరొక దేశానికి వెళ్ళారు. వాళ్ళు తిరిగి వచ్చేదాకా పెళ్ళిళ్ళకు అనుమతి లభించదు. అందుచేత కుసుమావతికి రాజాంతఃపురంలోనూ, కమలాక్షికి మంత్రి గారి భవంతిలోనూ బస ఏర్పాటు చేశారు.

తన కుమార్తెలు బయలు దేరి వెళ్ళిన కొంతసేపటికి వాళ్ళ తల్లి బియ్యం తీసుకుని పాడుబడిన గుడికి తిరిగి వచ్చింది. తన కుమార్తెలు ఏ కారణం చేతనో ఎటో వెళ్ళి పోయారనీ, దారి తనకు తెలియగలందు





లకు చీరతుంపులు వేశారనీ ఆమె గ్రహించి, వాటి ఆధారంతో మర్నాడు రాజధాని చేరుకుని, రాజభవనం కేసి వచ్చింది.

ఆ సమయాన కుసుమావతి మేడ మీద ఉండి తన తల్లి వస్తూండటం గమనించి చిరాకుపడింది. ఆమె తమ తల్లి అని తెలిస్తే రాజకుమారుడు తనను పెళ్ళాడతాడా? ఇలా అనుకుని ఆమె తన దాసీని పిలిచి, "ఆ వచ్చే బిచ్చగత్తె లోపలికి రావటానికి ప్రయత్నిస్తే దూరంగా తరిమేసి రా," అన్నది. దాసీది అలాగే చేసింది.

ఆ దాసి ప్రవర్తన తల్లికి కొంచెం కూడా అర్థం కాలేదు. పక్కనే ఉన్న మంత్రి భవనం మీదినుంచి కమలాక్షి తాను ఎదురు చూస్తున్న తన తల్లిని చూసి, "ఆ నుంచున్న మనిషిని మర్యాదచేసి పిలుచుకురా," అని తన దాసిని పంపింది. .

తల్లి రాగానే కమలాక్షి ఆమెకు మంచి భోజనం పెట్టించి, మంచి బట్టలు కట్టనిచ్చి, జరిగినదంతా ఆమెతో చెప్పింది. అంతా విన్న మీదట తల్లికి బడలికవల్లా, భుక్తాయాసంవల్లా నిద్రముంచు కొచ్చింది. కమలాక్షి ఆమెను తన గదిలోనే ఒక పక్కన ఉన్న మంచం మీద పడుకోనిచ్చింది.

కొంతసేపటికి విజయుడు కమలాక్షి గదికి వచ్చి, రాజుగారు తిరిగి వస్తున్నారనీ, త్వరలోనే పెళ్ళి నిర్ణయం అవుతుందనీ చెప్పి వెళ్ళిపోయాడు. ఆ పడుకున్న మనిషి ఎవరని అతను అడిగితే ఏం చెప్పటమా అని కమలాక్షి చాలా మథనపడింది గాని, అతనా ప్రస్తావనే తీసుకు రాలేదు.

తల్లి నిద్ర లేచాక కమలాక్షి ఆమెతో, "అమ్మా, అక్క అబద్ధాలాడి పెద్ద చిక్కు తెచ్చి పెట్టింది. నేను మంత్రికుమారుడితో నిజం చెప్పేస్తాను. ఆ తరవాత మన దారిన మనం పోదాం," అన్నది.

"వద్దు, వద్దు, అక్క తెలివైన ఆలోచనే చేసింది. మీ ఇద్దరూ సుఖంగా ఉండటం



ముఖ్యం గాని నా దేమిటి? నేను అందలా లెక్కాలా ఏమిటి? నే నున్నట్టే ఉండి పోతాను," అన్నది తల్లి.

రాజూ, మంత్రీ తిరిగి వచ్చారు. తమ కొడుకులు వాళ్ళకు నచ్చిన పిల్లలను పెళ్ళాడతామంటే వాళ్ళు అభ్యంతరం చెప్పలేదు. కాని అనుకోని విధంగా ఒక చిక్కు వచ్చింది.

ఆ అక్క చెల్లెళ్ళు రాజకుమార్తెలని తెలిశాక రాజు వాళ్ళ పెళ్ళిళ్ళు వాళ్ళ తల్లి దండ్రుల చేతి మీదుగానే జరగాలనీ, వాళ్ళ తండ్రి పేరూ, ఆయన ఏలే దేశం పేరూ తెలిసినందువల్ల ఆయనకు అవమానం ఏదీ ఉండదనీ, ఆయన ఊరూ, పేరూ చెప్ప మనీ కుసుమావతిని అడిగాడు.

కుసుమావతికి గుండె జారి పోయింది. "మాది మరకత దేశం, మా తండ్రి పేరు శ్రీపాదుడు," అని తన నోటికి వచ్చినట్టు ఆమె చెప్పేసింది.

మర్నాడే రాజుగారు కుసుమావతినీ, కమలాక్షినీ మరకత దేశానికి పంపించటానికి సన్నాహాలు చేశాడు.

కమలాక్షి తన అక్క వద్దకు వెళ్లి, "ఈ గండం నుంచి ఎలా తప్పిస్తావు?" అని అడిగింది.



"ఇంత విషం పుచ్చుకోవటం తప్ప నా కేమీ తోచటంలేదు," అన్నది కుసుమావతి దిగులుగా.

"చాలా గొప్ప ఆలోచనే చేశావు! మనం విషం తిని చస్తే మన సమస్య తీరుతుంది. కాని, అమ్మగతి ఏం కాను?" అంటూ కమలాక్షి తన గదికి తిరిగి వెళ్ళిపోయింది.

ఆ సాయంకాలం విజయుడు ఆమె వద్దకు వచ్చి, "మరకత దేశం వెళ్ళటానికి ప్రయత్నాలు పూర్తి అయాయి. నువు సిద్ధంగా ఉన్నావా?" అని అడిగాడు.

"మరకత దేశమూ లేదు, ఘట్టి గడ్డలూ లేదు. నేను అడవిలో ఆ పాడుగుడికే

తిరిగిపోతాను. జరిగినదంతా మరిచిపొండి," అన్నది కమలాక్షి. ఆమె అతనితో తన అక్క ఆడిన అబద్ధాలు చెప్పేసింది.

అంతా విని విజయుడు, "నాకు అంతా తెలుసు. మీ అక్క రాజకుమారుడితో అబద్ధాలు చెప్పేటప్పుడు నేను నీ ముఖమే చూశాను. ఆ అబద్ధాలు విని చాలా బాధ పడ్డావు. తరవాత నీ గదిలో మీ అమ్మను చూసి, ఆమెలో నీ పోలికా, మీ అక్క పోలికా కూడా గమనించాను. నువు అబద్ధం చెప్పలేవు. మీ అక్క చెబుతుంది గాని నమ్మేటట్టు చెప్పలేదు. వెయ్యి ఆమడ దూరంలో మరకతదేశ మన్నది లేదు. శ్రీపాదు డనే రాజూలేడు. రాజకుమారుడు అమాయకుడు. మీ అక్క మాటలు నమ్మే శాడు. అతనికి నేను చెప్పిన దాకా నిజం తెలీదు," అన్నాడు నవ్వుతూ.

కమలాక్షి ఒక పెద్ద నిట్టూర్పు విడిచి, "ఇప్పుడు నా ప్రాణం తేలికన పడింది. దయచేసి నన్నూ, మా అక్కనూ మా పాడు బడిన గుడి దగ్గిర దిగబెడతారా? నడిచి పోగలం గాని, దారి తప్పుతామేమో నని భయం," అన్నది.

"నేను నిన్ను పెళ్ళాడాలని చూసిన క్షణంలోనే అనుకున్నాను, అది తీరుతాను. ఇక మీ అక్క రాజకుమార్తె కాదని తెలియ గానే రాజకుమారుడు ఆమెను పెళ్ళాడ నివ్వరని మనోవ్యాధిలో పడ్డాడు. అది చూసి రాజుగారు కూడా వాళ్ళ పెళ్ళికి ఒప్పు కున్నారు. ముహూర్తం కూడా పెట్టేశారు. మీ అమ్మను కూడా పిలిపిస్తున్నాం," అన్నాడు విజయుడు.

అతను అన్నట్టే, అబద్ధాలాడటం చేత గాని అక్కా, అబద్ధాలాడ లేని చెల్లెలూ రాజకుమారుణ్ణీ, మంత్రికుమారుణ్ణీ పెళ్ళా డారు. వాళ్ళ తల్లి కూడా వచ్చి, రాజ భవనంలో, వాళ్ళ వెంటనే ఉన్నది. అందరూ సుఖంగా ఉన్నారు.





# కృష్ణావతారం

## 11. కంసవధ

ఆయుధాగారపు భటులు వచ్చి తన విల్లు విరిగిందని చెప్పగానే, కంసుడికి తన వీపే విరిగినట్టయింది. అతను పుట్టెడు విచారంతో లేచి, ఉత్సవానికి చేసిన ఏర్పాట్లు చూడబోయాడు. ఒక అందమైన రంగస్థలం ఏర్పాటుచేసి, రాజూ, మంత్రులూ, పై నుంచి వచ్చే రాజులూ, రాజబంధువులూ, భృత్యులూ, పౌరులూ, విలాసినులూ కూర్చోవటానికి వేరువేరు స్థలాలు నిర్మించి, వాటికి మెట్లు అమర్చారు. అంతటా కనులపండువైన శిల్పాలూ, తెరలూ, తోరణాలూ ఉన్నాయి. అంతటా అలంకార వస్తువులూ, పూలూ, ధూపాలూ ఏర్పాటై ఉన్నాయి. వీటన్నిటినీ పరీక్షించి, పనివాళ్ళకు అవసరమైన పనులు చెప్పి, కంసుడు తన అంతఃపురానికి తిరిగివచ్చి, చాణూరముష్టికు లనే మల్లులను పిలిపించి, "ప్రపంచంలో మీసాటి మల్లులు లేరు. బలరాముడూ, కృష్ణుడూ అనే గొల్లకుర్రకుంకలు ఇప్పటిదాకా అడవిలో తిరిగిన వాళ్ళు. వాళ్ళకు ధైర్యమూ, ప్రతాపమూ, శౌర్యమూ ఏ కోశానా లేవు. వాళ్ళు మీతో తలపడినప్పుడు మీరు వాళ్ళతో చాలాసేపు పెట్టుకోక, ఒక దెబ్బన చంపేసినట్టయితే నాకు చాలా మేలు కలుగుతుంది," అన్నాడు.

రాజు ఈ విధంగా అడిగినందుకు సంతోషించి మల్లులు, "మా కింతగా చెప్పాలా? ఆ గొల్లబ్బాయిలు చిక్కగానే నలిపేస్తాం. మా సంగతి తమ రెరగరా? ఇది మా కొక పనా?" అని చెప్పి, పెద్దగా



మల్లలు చరిచి, బొబ్బలుపెట్టి తమ ఇళ్ళకు వెళ్ళిపోయారు.

తరవాత కంసుడు మహామాత్రు డనే మావటివాణ్ణి పిలిపించి, "నువు నాకు చాలా ఆప్తుడివి. నీతో ఇప్పుడు ముఖ్యమైన పని పడింది. వసుదేవుడి కొడుకులు గొల్ల పల్లెలో పెరిగి, గొల్లలలాగే తయారైనారు. వాళ్ళు మహా చెడ్డవాళ్ళు, బలవంతులు. వాళ్ళిక్కడికి వచ్చి ఉన్నారు. ముందుగానే వేకువవేళ నువు కువలయాపీడాన్ని తీసు కుని రాజభవనద్వారం దగ్గిర సిద్ధంగా ఉండి, వాళ్ళు అక్కడికి రాగానే వాళ్ళ మీదికి దాన్ని ఉసిగొల్పు. కువలయాపీడం వాళ్ళిద్దర్నీ క్షణంలో పీనుగులను చేసే స్తుంది," అన్నాడు.

మర్నాడు తెల్లవారింది. రాజ శాసనం ప్రకారం అందరూ వచ్చి రంగస్థలాన ఎవ రెవరి స్థానాలలో వారు కూర్చుని, బలరామ కృష్ణుల రాక కోసం ఆత్రంగా ఎదురు చూస్తున్నారు. కంసుడు చాలా ఎత్తున బంగారు సింహాసనం మీద, తెల్ల బట్టలూ, ముత్యాలతో కూడిన ఆభరణాలూ ధరించి, తెల్లటి గొడుగూ, వింజామరాలు వేయించు కుని, తెల్లని బట్టలు కట్టిన విలాసినులతో సహా చంద్రుడి లాగా ప్రకాశిస్తున్నాడు.

చాణూర ముష్టికులు మదించిన ఏను గుల లాగా ఉత్సవ రంగం ప్రవేశించి, కంసుడి కెదురుగా నిలబడ్డారు. మహా మాత్రుడు కువలయాపీడాన్ని ఎక్కి వచ్చి, ద్వారం వద్ద నిలిపి, బలరామ కృష్ణుల రాక కెదురు చూస్తున్నాడు.

కొంచెం సేపటికి బలరామ కృష్ణులు ద్వారం వద్దకు వచ్చారు. వారిని అందరూ అమితాశ్చర్యంతో చూశారు. వాళ్ళు ఎంతో నిశ్చింతగానూ, నిర్వికారంగానూ ఉన్నట్టు కనపడ్డారు. వాళ్ళు ద్వారం వద్ద కనిపించ గానే వాద్యాల మోతా, ప్రేక్షకుల హర్ష ధ్వానాలూ మిన్ను ముట్టాయి. ఆ కోలా



హలం మధ్య మహామాత్రుడు కువలయా పీడాన్ని వాళ్ళ మీదికి తోలాడు.

అది గమనించిన కృష్ణుడు బలరాముడి కేసి నవ్వుతూ, "కంసుడు మనని చంపించ టాని కొక ఏనుగుగున్నను సిద్ధం చేశాడు. పాపం, తాను మృత్యువు కోరల సందున ఉన్న సంగతి ఎరగడు. నువు నన్ను గమ నిస్తూ ఉండు," అని ముందుకు నడిచాడు. పెద్ద దంతాలూ, భయంకరమైన తొండమూ ఎత్తి, భూమి అదిరేలాగా అడుగులు వేస్తూ కువలయాపీడ మనే ఏనుగు మహా రౌద్రంగా కృష్ణుడి పైకి వచ్చింది.

కృష్ణుడు దానితో యుద్ధం చేసే మిష మీద తన బలం అందరికీ చూపుదామనీ, కాస్సేపు వినోదం పొందుదామనీ, ముందు ఏనుగును దాని తొండంతో తన రొమ్ముమీద కొట్ట నిచ్చాడు. తరవాత, ఎగిరి, దాని దంతాల పైన కాళ్ళు పెట్టి నిలబడి, ఎడమ కాలితో దాని కుంభస్థలాన్ని బలంగా తన్ని, దాని వీపు మీదికి వెళ్ళి, అది వెనక్కు చాచిన తొండాన్ని పట్టుకుని, కిందికి దూకి, పిడికిటితో దాని డొక్కల్లో పొడిచాడు. ఏనుగు వెనక్కు తిరిగే సరికి, దాని కాళ్ళ సందుగా వెనక్కు వెళ్ళి, దాని తోక పట్టు కుని గుండ్రంగా తిప్పాడు. ఏనుగు చేసేది




లేక కింద పడి, వెంటనే లేచి, అమిత రోషంతో అతని పైన తొండంతో బాదింది, దంతాలతో పొడిచింది. కృష్ణు డిక దాన్ని చంప నిశ్చయించి, ఎగిరి కాలితో దాని ముఖం మీద తన్ని, దాని దంతం ఒకటి బలంగా పెరికి, దానితోనే ఏనుగు తలను బద్దలు కొట్ట నారంభించాడు. త్వరలోనే కువలయాపీడం నేల కూలి ప్రాణాలు విడి చింది. దానితో బాటు కింద కూలిన మావటి వాడి తల దాని దంతంతోనే పగలగొట్టి కృష్ణుడు వాణ్ణి కూడా చంపేశాడు.

ఏనుగు చేసిన గాయాల నుంచి రక్త ధారలు కారుతూ, చేతిలో దాని దంతం





పట్టుకుని మహా భయంకరాకారంతో సభలో ప్రవేశించిన కృష్ణుణ్ణి చూసి కంసుడు అమిత క్రోధంతో చాణూరుడి కేసి చూసి, కృష్ణుడితో మల్లయుద్ధం చెయ్యమని అజ్ఞాపించాడు. అలాగే ముష్టికుణ్ణి బలరాముడితో యుద్ధం సాగించమన్నాడు.

చాణూర ముష్టికులు ఆంధ్రులు. దిగ్గజాలను పోలినవాళ్లు. ప్రపంచంలో తమకు చాలినవాళ్లు లేరన్న గర్వాతిశయం గలవారు. చాణూరుడు కృష్ణుణ్ణి సమీపించి వెటకారంతో కూడిన కోపంతో, "గోవులను కాస్తూ, గొల్ల పిల్లలను భయపెట్టి గొప్ప ఖ్యాతి సంపాదించావు గాని, ఇవాళ నా



పాల పడ్డావు, తప్పించుకోలేవు. మహారాజు, మెచ్చుకునేటట్టుగా నిన్నిప్పుడే యమకింకరుల కప్పగిస్తాను," అన్నాడు.

కృష్ణుడు చాణూరుడితో తాపీగా, "కంసుడు నీ మీద చాలా ఆశలు పెట్టుకుని ఉన్నాడు. అందుచేత నీ బలమంతా చూపించు. వ్యర్థాలాపాలతో ఏమవుతుంది?" అంటూ మల్లచరిచాడు.

చాణూరుడు కృష్ణుడి పైకి కలియబడ్డాడు. సభలో ఉన్న యాదవులు కృష్ణుణ్ణి గురించి భయపడ్డారు. "కొండంత చాణూరుడికీ, పిల్లవాడు కృష్ణుడికీ మల్లయుద్ధమేమిటి? అన్యాయం! ఇక్కడ ఉండే పెద్దలకు ఆ మాత్రం జ్ఞానం లేదా? అదీగాక, మల్లయుద్ధం చేసే పద్ధతి ఇది కానే కాదు. మల్లులతో యుద్ధం చేసేవారికి సహాయకులు వెంట ఉండి, అలిసినప్పుడు శైత్యాది ఉపచారాలు చెయ్యాలి, మోటు బలానికీ నేర్పరితనానికీ తేడా గమనించాలి, అవసరమైనప్పుడు యుద్ధం ఆపాలి. ఇది వినోదం గాని, విరోధుల మధ్య కొట్లాట కాదే! అయినంత మటుకు చాలు. రాజుగారు ఇద్దరినీ తగిన విధంగా సత్కరించి, యుద్ధం అపు జెయ్యటం మంచిది," అని యాదవులు తమలో తాము అనుకోసాగారు.





అ మాటలు విని కృష్ణుడు వారితో, "నన్ను ఇలాగే పోట్లాడ నివ్వండి. మనో బలమూ, పరాక్రమమూ, ఓపికా, ఉత్సాహమూ, జయమూ ప్రదర్శించే యోధుడికి ఒడ్డూ, పొడుగూ, వయసూతో ఏం పని? నేను పగపట్టి వీణ్ణి చంపాలనే ఉద్దేశంతోనే ఉన్నాను. మిమ్మల్ని మెప్పిస్తాను. మీరు అదీ ఇదీ అనక, చూస్తూ ఉండండి. ఈ చాణూరుడు కరూశ దేశంలో పుట్టినవాడు. ఎందరో మల్లులను హతమార్చిన వీణ్ణి పడగొట్టి గొప్ప కీర్తి సంపాదిస్తాను," అని చాణూరుడితో మల్లయుద్ధం ప్రారంభించాడు.

అ యుద్ధంలో ఆరితేరిన చాణూరుణ్ణి మించిన నేర్పు కృష్ణుడు చూపాడు. ఒకరినొకరు వంచుతూ, తోస్తూ, వంగుతూ, ఎగురుతూ, ఒదుగుతూ, పక్కకు తొలుగుతూ చాలా అద్భుతంగా వాళ్ళు యుద్ధం చేశారు. వీపుకు వీపూ, తలకు తలా తగిలినప్పుడూ, ఒకరినొకరు గుద్దుకున్నప్పుడూ గొప్ప ధ్వనులు పుట్టాయి. ఒకరినొకరు చేతులతోనూ, కాళ్ళతోనూ తన్నుకుంటూ, దంతాలతోనూ, గోళ్ళతోనూ రక్కుకుంటూ పోరాడుతుంటే చూసేవారికి అతి భయంకరంగా ఉన్నది.



మొత్తం మీద అన్ని రకాలపట్లలోనూ కృష్ణుడి నేర్పే హెచ్చుగా కనబడి, సభికులు హర్షధ్వానాలు చేస్తే, కంసుడు కోపంగా "ఆపండి" అన్నట్టు చేత్తో సంజ్ఞ చేశాడు. కృష్ణుడు కొంతసేపు తన చాకచక్యం ప్రదర్శించి, చాణూరుడి పని తేల్చెయ్య నిశ్చయించాడు. చాణూరుడి పని కూడా చాలావరకు అయిపోయింది. దుర్బలుడైపోతున్న ఆ మల్లుడిపైన కృష్ణుడు ఒక్కపెట్టున లంఘించి, వాడి నడి తల మీద పిడికిలితో ఒక్కపోటు పొడిచి, ఎగిరి మోకాలితో వాడి గుండెలో ఒక్కతాపు తన్నాడు. ఆ దెబ్బతో చాణూ





రుడు గుడ్లు వెళ్ళబెట్టి, నోట నెత్తురు కక్కుతూ కిందపడి ప్రాణాలు వదిలాడు.

కృష్ణుడు చాణూరుణ్ణి చంపే లోపునే బలరాముడు ముష్టికుణ్ణి హత మార్చేశాడు. మల్లు లిద్దరినీ కడతేర్చి, బలరామకృష్ణులు రంగస్థలాన విజయులై నిలబడ్డారు. వాళ్ళు కంసుడి కేసి చూసిన చూపూ, కంసుడి ముఖంలో కనిపించిన క్రౌర్యమూ చూసి నందగోపుడు మొదలైన గోపకు లందరూ భయంతో వణుకుతూ, కుక్కిన పేనుల్లాగా ఉండిపోయారు.

తాను కని పారేసిన కొడుకు చాణూరుడి చేతిలో ఏమైపోతాడో, ఇంత కాలానికి కన



పడి అంతలోనే ప్రాణాలు విడుస్తాడేమో నని తల్లడిల్లిన దేవకీదేవి, చాణూరుణ్ణి చంపిన తన కొడుకు దర్పం చూసి ఆనందాశ్రువులు రాల్చింది. వసుదేవుడి ఆనందానికి కూడా మేరలేదు.

కంసుడికి మాత్రం ముఖాన చెమటలు పోస్తున్నాయి. దురాగ్రహంతో శరీరమంతా కంపిస్తున్నది. ఊపిరి భారంగా తీస్తున్నాడు. ఎర్రటికళ్ళ నుంచి నిప్పులు కక్కేవాడిలాగా చూస్తూ అతను, నాలుగు వైపులా చూసి, తన నౌకర్లను పిలిచి, "ఈ గొల్ల కుర్రాళ్ళను ఇద్దరినీ తీసుకుపోయి నగరం దాటి పంపెయ్యండి. నందగోపుణ్ణి పట్టుకుని, సంకెళ్ళతో బంధించండి. మిగిలిన గోపకులందరినీ శిరశ్ఛేదం చెయ్యండి. నా రాజ్యంలో గొల్లవాడన్నవాడు కనిపిస్తే దొంగలను శిక్షించినటు శిక్షించండి. గొల్లల సొత్తు తీసేసుకోండి. కుటిలుడైన వసుదేవుడికి క్రూరమైన శిక్ష ఇవ్వండి." అని ఆజ్ఞాపించాడు.

ఈ మాటలు విని ఎక్కడివాళ్ళక్కడ కొయ్యబారిపోయారు. మళ్ళీ శోకం ముంచుకొచ్చి దేవకీదేవి మూర్ఛపోయింది.

కృష్ణుడు తన తల్లిదండ్రుల దైన్యమూ, బంధువర్గంపడే బాధా, సభలో ఉన్న

వాళ్ళ అసహాయస్థితి చూసి ఆగ్రహావేశం చెందాడు. అతను ఊహించరాని వేగంతో సింహాసనం మీద కంసుడున్న చోటికి మెల్లెక్కి వచ్చాడు.

సభలో వాళ్ళకు కృష్ణుడు ఎక్కి రావటం కనిపించలేదు. ఒక క్షణం రంగస్థలంలో ఉన్నాడు, మరుక్షణం అతను కంసుడి వద్ద ఉన్నాడు.

మరుక్షణం అతను కంసుడి కిరీటాన్ని తన్నేశాడు, దాని మణులు రాలాయి. కంసుణ్ణి జుట్టు పట్టుకుని తల వంచి, తల అంతటా పిడికిలితో తెగ పొడిచాడు. మోకాలితో గుండెల్లో పొడిచాడు. కంసుడు ఏమీ చెయ్యలేకపోయాడు. అతని మెడలో హారాలు తెగిపోయాయి. చెవిలో పెట్టుకున్న పూలు రాలాయి. బట్ట ఊడిపోయింది. ముక్కునా, చెవులా, నోటా రక్తం చిమ్మేలాగా, కనుగుడ్లు వెళ్ళుకొచ్చేలాగా కంసుణ్ణి కృష్ణుడు పై నుంచి కిందికి తోసి, చేత్తో నెట్టాడు. ఆ తోపుతో కంసుడి శవం రంగద్వారాన పరిఘ ఆకారంలో పడిపోయింది.

ఇదే సమయంలో బలరాముడు, కంసుడి తమ్ముడైన సునాము డనేవాడి పైన సింహంలాగా లంఘించి, వాణ్ణి హతమార్చేశాడు.

కృష్ణుడు కంసుణ్ణి చంపిన చేతులతోనే వసుదేవుడి పాదాలు తాకి నమస్కరించాడు. వసుదేవుడు కృష్ణుణ్ణి గాఢంగా కౌగలించుకుని ఆశీర్వదించాడు. తరవాత కృష్ణుడు దేవకికి నమస్కరించాడు. ఆమె అతన్ని కౌగలించుకుని తల వాసన చూసింది.

తరవాత కృష్ణుడు ఉగ్రసేనుడికీ, పెద్దలకూ మొక్కి వారి దీవనలు పొంది, అందరినీ వెళ్ళిపొమ్మని చెప్పి, తాను బలరాముడితో సహా తన తండ్రి ఇంటికి వెళ్ళిపోయాడు.





# అరణ్యపురాణం

## 14

బలదేవుడు నేల మీద పడుకుని దగ్గుతూ, మూలుగుతున్నాడు. అందరూ అతని పైన ప్రశ్నల వర్షం కురిపిస్తున్నారు. అతని జుట్టు భుజాల మీదికి వేళ్ళాడుతున్నది. చెట్టెక్కటంలో అతని చేతులూ, కాళ్ళూ దోక్కుపోయాయి. సరిగా మాట కూడా రావటం లేదు. కాని తన ప్రాముఖ్యం బాగా అర్థం చేసుకున్నా డతను. అతను సూచన ప్రాయంగా భూతాలను గురించీ, దయ్యాల పాట గురించీ, ఇంద్రజాలం గురించీ పొడి మాటలు చెప్పి, వినేవాళ్ళ ఆసక్తిని తెగ రెచ్చగొట్టి, చివరకు మంచినీళ్ళు అడిగాడు.

మౌగ్లీ, "బలదేవుడి కథ చెవుల్లో వేసుకున్న దాకా మెస్సువాకు కాపలా ఉండే పని ఎవరికీ పట్టదు," అనుకుని, గుడిసెకు తిరిగి వచ్చాడు. అతను కిటికీ దగ్గరికి చేరుకునే సరికి, అతని కాలిని ఎవరో నాకినట్టయింది. అతనికి తోడేలమ్మ స్పర్శ బాగా తెలుసు.

"నువా, అమ్మా? ఇక్కడేం చేస్తున్నావు?" అన్నాడతను.

"బిడ్డలు అరణ్యంలో పాటలు పాడటం వినపడింది. నా కప్పాయిని వెతుక్కుంటూ వచ్చాను. సరే కాని, నీకు పాలిచ్చిన ఆ ఆడ మనిషిని ఒకసారి చూడాలనుందిరా," అన్నది తోడేలమ్మ.

"ఆమెను కట్టి బంధించి, చంపటానికి సిద్ధం చేశారు. నేను కట్లు కోసేశాలే. ఆమే, ఆమె మొగుడూ అరణ్య మార్గాన వెళ్ళిపోతారు," అన్నాడు మౌగ్లీ.

"సరే, నేనూ వెంట వస్తాను. పెద్దదాన్నయాననుకో, ఇంకా పళ్ళూడలేదుగా!" అంటూ తోడేలమ్మ వెనక కాళ్ళ మీద లేచి, కిటికీ కుండా లోపల చీకట్లోకి చూసింది.

అట్ట చివరి బొమ్మ



మౌగ్లీ తిరిగి కిటికీ కుండా లోపల ప్రవేశించి, "ప్రస్తుతం అందరూ బలదేవుడి చుట్టూ మూగి ఉన్నారు. వాడు చెప్పే భూతప్రేతాలకథలు పూర్తికాగానే వాళ్ళు నిప్పు తెచ్చి మిమ్మల్ని తగలేస్తారుట. ఆ తరవాత?" అన్నాడు.

"నేను మా ఆయనతో మాట్లాడాను. ఖాన్హివారా ఇక్కడికి ముప్పై మైళ్ళు. అక్కడ మాకు ఇంగ్లీషువాళ్ళు తగలవచ్చు—" అన్నది మెస్సువా.

"వాళ్ళేజాతి మంద?" అన్నాడు మౌగ్లీ.

"నాకు తెలీదు. తెల్లగా ఉంటారుట. దేశమంతా ఏలుతున్నారుట. ఈ రాత్రి అక్కడికి చేరామా, బతుకుతాం. లేకపోతే చస్తాం," అన్నది మెస్సువా.

"అయితే బతకండి. ఈ రాత్రి నరమానవుడన్నవాడు గ్రామద్వారం దాటడు.... ఆయన ఏమిటి చేస్తున్నాడు?" అని మౌగ్లీ అడిగాడు. మెస్సువా భర్త మోకరించి కూర్చుని, గుడిసెమూల తవ్వుతున్నాడు.

"దాచుకున్న డబ్బు. ఇంకేమీ వెంట పట్టుకుపోలేం," అన్నది మెస్సువా.

మెస్సువా భర్త మౌగ్లీ కేసి చూసి, "ఈ డబ్బుతో ఒక గుర్రం కొనవచ్చు. ఇంకో గంటలో గ్రామస్థులు వెంట తగులుతారు," అన్నాడు.

"నేను తలుచుకున్నదాకా వాళ్ళు మీ వెంట పడరని నేను చెబుతున్నాను. అయినా గుర్రం ఆలోచన మంచిదే. మెస్సువా డస్సి ఉన్నది," అన్నాడు మౌగ్లీ.

మెస్సువాభర్త రూపాయలన్నీ తీసుకుని, లేచి నిలబడి, వాటిని తన బొడ్డులో దోపుకున్నాడు. మౌగ్లీ మెస్సువాను పట్టుకుని, కిటికీ కుండా బయటికి రప్పించాడు. బయటి చల్లని గాలికి ఆమె ప్రాణం లేచి వచ్చింది.

"ఖాన్హివారాకు దారి తెలుసునా?" అని మౌగ్లీ రహస్యంగా అడిగాడు. వాళ్ళు తెలుసునన్నట్టు తలలు ఆడించారు.



"భేష్, మీకు వచ్చిన భయమేమీలేదు. తాపీగానే వెళ్ళండి. అయితే ఒకటి—మీకు ముందూ, వెనకా కొంత పాట వినిపించ వచ్చు," అన్నాడు మౌగ్లీ.

"ప్రాణాలతో మమ్మల్ని తగలబెట్టేస్తా రన్న భయమే లేకపోతే ఈ నిశిరాత్రివేళ అరణ్యంలోకి అడుగుపెట్టే వాళ్ళ మను కుంటున్నావా? మనుషుల చేతిలో చచ్చే కన్న క్రూరమృగాల చేత చావటం నయం," అన్నాడు మెస్సువాభర్త.

"నేను చెబుతున్నానుగద, అరణ్యంలో మీకు ఎలాటి ప్రమాదమూ జరగదు. ఖాన్హి వారా కనుచూపు మేరలోకి వచ్చేదాకా మీకు రక్షణ ఉంటుంది; ఒక మనిషి భయం గాని, జంతువు భయంగాని ఉండదు, నింపాదిగా వెళ్ళండి. ద్వారం మూసే ఉన్నది," అన్నాడు మౌగ్లీ.

మెస్సువా మౌగ్లీ కాళ్ళమీద పడింది. మౌగ్లీ శరీరం ఒక్కసారి జలదరించింది. అతను ఆమెను లేవనెత్తాడు. మెస్సువా అతని మెడ వాటేసుకుని, వైన వైనాలుగా దీవించింది.

ఆమె భర్త తన పొలాల కేసి ఈర్ష్యగా చూస్తూ, "మనం ఖాన్హివారా చేరి, ఇంగ్లీషు వాళ్ళతో మాట్లాడాలేగాని, బ్రాహ్మడి మీదా,



బలదేవుడి మీదా ఎలాటి వ్యాజ్యం తెస్తా నంటే, గ్రామమంతా దివాలా తీయవలిసిందే. నా పొలాల మీద రాని ఫలసాయానికీ, తిండికి మాడిన నా గేదెలకూ రెట్టింపు విలవ రాబట్టనూ. నాకు గొప్ప న్యాయం జరుగు తుంది," అన్నాడు.

మౌగ్లీ నవ్వి, "న్యాయమంటే ఏమిటో నాకైతే తెలీదుగాని, వచ్చే తొలకరికి వచ్చి, ఇక్కడ ఏం మిగులుతుందో మీరే చూడండి," అన్నాడు.

వాళ్ళు అరణ్యం కేసి బయలుదేరారు. తోడేలమ్మ తాను దాక్కున్న చోటునుంచి చెంగున దూకింది.





73

"వీళ్ళ వెంట వెళ్ళు. ఈ ఇద్దరికీ ఏ అపాయమూ రాగూడదని అరణ్యమంతకూ తెలుపు. అవసరమైతే కేకలు వెయ్యి. బాఘీరను పిలవటం మంచిది," అన్నాడు మౌగ్లీ తోడేలమ్మతో.

ఒక దీర్ఘమైన కూత క్రమంగా హెచ్చి మళ్ళీ తగ్గింది. మెస్సువా భర్త ఆ కేక వింటూనే ఉలిక్కిపడి చూసి, ఇంటికి పరిగెత్తే వాలకం కనబరిచాడు.

"పదండి, పదండి. కొద్దిగా పాట ఉంటుందని చెప్పానుగద. ఖాన్హివారా దాకా మీకీ పాట వినిపిస్తూనే ఉంటుంది, అది అరణ్యం యొక్క అభయం," అన్నాడు మౌగ్లీ.

మెస్సువా తన భర్తను తొందరచేసి ముందుకు నడిపించింది. వాళ్ళతోబాబు తోడేలమ్మ కూడా చీకటిలో అదృశ్యమయింది. ఆ క్షణంలోనే బాఘీర, ఎప్పుడక్కడికి వచ్చాడో ఏమో, మౌగ్లీ కాళ్ళ దగ్గిర ప్రత్యక్షమయాడు.

"అన్నలు నలుగురూ ఏరీ? ఈ రాత్రి ఒక్క మనిషి కూడా గ్రామద్వారం దాటి పోరాదు," అన్నాడు మౌగ్లీ.

"దానికి నేను చాలనా, తమ్ముడూ?" అన్నాడు బాఘీర.

"ఆ చెట్టు కింద సంభాషణ ఎంతకూ తేలకుండా ఉంది. వాళ్ళు గుడిసెకు వచ్చి ఆ భార్యా భర్తలను తగలబెట్టటానికి చాలా తొందరపడుతున్నారు. వాళ్ళు వచ్చి చూసేసరికేముంటుంది? గుడిసె ఖాళీ! అహహ!" అంటూ మౌగ్లీ నవ్వాడు.

"వాళ్ళు వచ్చేసరికి నన్నిక్కడ ఉండనీ, తమ్ముడూ. నన్ను చూశాక ఎవరూ ఇళ్ళు దాటి రారు. నన్ను తాళ్ళతో కట్టెయ్యరులే," అంటూ బాఘీర గుడిసెలో దూరాడు. బాఘీర మంచం మీద పడుకుని మౌగ్లీని కూడా తన పక్కన కూర్చోమన్నాడు. కాని మౌగ్లీ మనుషుల కంట పడదలచలేదు.

—(ఇంకావుంది)



# 68. విక్టోరియా జలపాతం

"మొసి - ఒఅ - తున్య" (పొగ కూడా ధ్వనిస్తుంది) అన్న పేరు గల ఈ జలపాతం రొడిసియా (ఆఫ్రికా)లో ఉన్నది. దీని నిడివి ఒక మైలు, ఎత్తు 256 మొదలు 343 అడుగులు వుంటుంది.



Photo by Pranlal Patel



బహుమతి
పొందిన వ్యాఖ్య

ఒంటరితనంలో చేదు

పంపినవారు :
ఎం. అజీజుద్దీన్, హైద్రాబాద్

Photo by Prabhakar Mahadik



బహుమతి
పొందిన వ్యాఖ్య

సాహచర్యంలో లేదు

పంపినవారు:
ఎం. అజీజుద్దీన్, హైద్రాబాద్

## ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 10 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1967 సెప్టెంబర్ నెల సంచికలో ప్రకటించబడును.





★ పై ఫోటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.)

★ జూలై నెల 20-వ తేదీ లోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 10/లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డు పైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి:—చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు—26.

---

## జూలై నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : ఒంటరితనంలో చేదు

రెండవ ఫోటో : సాహచర్యంలో లేదు

పంపినవారు : ఎం. అజీజుద్దీన్,

హిందూస్థాన్ మెషిన్ టూల్స్ (లి) హైద్రాబాద్—37

బహుమతి మొత్తం రు. 10/— ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

Printed by B. V. REDDI at The Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for Sarada Binding Works, 2 & 3, Arcot Road, Madras-26. Controlling Editor: 'CHAKRAPANI'


అబ్బాయిలూ, చిర్రుబుర్రు తాతను ఓమారు చూచి వద్దాం పదండి.
ఆ కోపిష్టి తాతేనా? ఎందుకేంటి, మళ్లీ మనల్ని తరిమి కొట్టాడు.
మరోమారు పోయివద్దాం పదండి-పాపం, ఒంటరిగా వుంటాడు.
హడావిడిగా వున్నాదేమో చూద్దాం-కిటికీలోంచే తొంగిచూద్దాం.
అబ్బ, కటిక చీకటిరా-దిలీప్, నీ టార్చి యిలా చూపించు- నా కాలికి ఏదో తగిలింది.
వహ్వా-లాకెట్టురా-తాతదే అయివుండొచ్చు. అడుగుదాం పదండి.
కుర్రకుంకల్లారా, ఇలా వచ్చి నన్ను అల్లరి పెట్టొద్దని చెప్పేనా?
తాతా, మేం వచ్చింది...
పొండి ఇక్కడ్నుంచి-నాకు చాలా పనివుంది.
దిలీప్ బృందం తాతకు చేసిన మేలు
తాతా, ఇది నీదా? మీ పెరట్లో దొరికింది...
అవునర్రా-ఈ లాకెట్ నాదే!
పిల్లలూ ఇంట్లోకి రండి-మీ మేలు మరి జన్మలో మర్చిపోను...
అలా అనకు తాతా. నీకు సేవచేసినందుకు ఎంతో ఆనందంగావుంది.
ఈ ఉపకారమంతా 'ఎవరెడి' టార్చిదే!
UC 3714

